# ఆరుద్ర సినీ గీతాలు

## కురిసే చిరుజల్లులో





సంకలనం : కె. రామలక్ష్మి

# ఆరుద్ర సినీ గీతాలు

## (1977-1998)

ఐదవ సంపుటం

## కురిసే చిరుజల్లులో

సంకలనం:

కె. రామలక్ష్మి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**ARUDRA CINE GEETHALU (1977-1998) - Vol. 5**
**KURISE CHIRUJALLULO**
***Compiled by K. Ramalakshmi***

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

ప్రచురణ నెం. : 2350/15

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 2003



**వెల: రూ.75-00**

ప్రతులు **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-1.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం,
కాకినాడ.



ముద్రణ: **శ్రీకళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# ముందుమాట

తెలుగు సినిమా పాటలు – తెలుగు సాహిత్యానికి ఒక శాఖ అని అనలేము. సినిమా పాటలు – అవసరాన్ని బట్టి సన్నివేశానుగుణంగా, ఒక్కొక్కప్పుడు వరసకనుగుణంగా రచింపబడినవి. సాహిత్యశాఖగా గుర్తించకపోడానికి కారణం ఇవి ఆత్మానందం కోసమే. సాహిత్యపులోతులు తరచి విశేషాలు ఆవిష్కరించడానికి మేధను మథించి రూపొందించినవి కాకపోవడమే. ఇవి అచ్చంగా సినిమాల కోసం రాసినవి. అయితే, ఎక్కడేనా వీటిలోనూ ఎప్పుడో ఎక్కడో ఒక్కొక్కసారి సాహితీగుబాళింపు తళుక్కుమనిపించినవి లేకపోలేదు. అందుకే సినీగీతం వినాలి. చూడాలి. చదివితే కనిపించే కవిత్వం తక్కువ.

సినిమా పాట జనరంజకంగా వుండాలన్నది మొదటి లక్షణం. అందుకే మంచిదైనా, మామూలుదైనా, సినిమా పాట – అనుకోని సందర్భాలలో అక్కడక్కడ జనం నాలుకమీద ఆడుతూ వుంటుంది. సినిమా – కళ కానట్టే సినిమా పాటకూడా సాహిత్య ప్రావీణ్యం కలది కాదు. ఇది సంతోషం కల్గించడానికి, వినోదం కల్గించడానికి.

ప్రస్తుతం సినిమా పాటల సంకలనాలు చాలా వస్తున్నాయి. ఔత్సాహిక 'పాటకారులు' వీటిని చదువుతున్నారు. పాటలు నేర్చుకొని పోటీలలోను, వేదికలమీదా పాడుకొంటున్నారు.

ఎక్కడో ఒకటీ ఆరా తప్పించి, సినీ కవి రాసిన పాటలన్నింటినీ ఎప్పటికప్పుడు కాపీ చేసి పెట్టుకోవడం నేను ఎగరను. కాని ఈ రోజులు వేరు.

ఇండియన్ పెర్‌ఫార్మింగ్ రైట్స్ సొసైటీ (I.P.R.S) ఏర్పాటు అయ్యాక సినీకవులు గాయకులు సంగీత దర్శకులు తమ పాటల వివరాలను సేకరించుకొనే ప్రయత్నాలు ప్రారంభించారు. ఇది ఎంతో కష్టమైన పని అని ప్రారంభించేదాకా తెలియదు. I.P.R.S. లో తమ తమ పాటల పూర్తి వివరాలను నమోదు చేసుకోలేని కవులూ సంగీత దర్శకులూ చాలా మంది ఉన్నారని – వారి కార్యాలయం తెలిపిన భోగట్టా.

పూర్వం సినిమా థియేటర్ల దగ్గిర పంపిణీదారులు ప్రచురించి అమ్మిన పుస్తకాల్లో కథ పాటలు ఇతర వివరాలు వుండేవి. చాలా కాలమై ఇవి కనుమరుగయ్యాయి.

ఈ పుస్తకాలు సేకరించి – వాటిని సినిమా పాటల పరిశోధనా కేంద్రాలుగా రూపొందించి కొందరు సేకరణ కర్తలు వీటి గిరాకీని గుర్తించారు. కవులకే వారి పాటలను వేలాది రూపాయిలకి అమ్ముతున్నారు. డబ్బున్న కవులు వేలు గుమ్మరించి

తమ పాటలు కొనుక్కొని సంకలనాలు వేసుకుంటున్నారు. వేయించుకొంటున్నారు. అసలీ పాటలని I.P.R.S. లో ఎందుకు నమోదు చేసుకోవాలి? ఈ విషయం చాలా మంది సామాన్యులకి తెలియదు. ఈ సంస్థ మేధా హక్కుల పరిరక్షణలో - రక్షకభటునిలా నిలుస్తుంది. ఎక్కడ ఎప్పుడు ఏవిధంగా ఒక సినిమాపాట వేసినా దానికై కొంత రాయల్టీ సేకరిస్తుంది. ఆ పాట వేసే థియేటర్లలో సీట్ల లెక్కనుబట్టి కొంత శాతం రాయల్టీ సేకరిస్తుంది. ఇలా సేకరించిన మొత్తాన్ని ఏడాదికి ఒకసారి ఆయా రచయితలకు పంచుతుంది. దీనివల్ల ధనలాభంమాట అటుంచితే కనీసం కవిపేరు నిలుస్తుంది. ఎవరెవరి పాటలో ఎవరెవరి పేరనో చెలామణీ అయిపోతూ వుంటాయి. రాగభావాలు తెగ వివరించీ - పాటల్లో మాటలు దొర్లించీ మురిసిపోయే కొందరు 'యాంకర్లు' కూడా సినిమా పేరు, పాడినవారు పేర్లూ చెప్తారుగాని కవిపేరు దాట వేస్తుంటారు. ఇలాంటప్పుడు 'ఇహం చెడ్డా ఫలం' దక్కేపని యీ I.P.R.S. - కవులకి రచయితలకి చేస్తుంది.

సినిమా పాట విషయంలో ఆరుద్రది చాలా నిర్లిప్తమైన అనురాగం. నేనెప్పుడూ అతని చేతిలో పూర్తి సినిమాపాట కాగితాన్ని చూడలేదు. అతనికి పాట రచన వృత్తి; సాహిత్యం ప్రవృత్తి. ఈ ప్రవృత్తికి సినిమా పాట - బంగారు పళ్ళేనికి గోడదాపు. సినిమా పాటల రచనవల్ల వచ్చిన దానిలో చాలా మటుకు - సాహితీ సంపద సేకరించడానికే వినియోగించాడు ఆరుద్ర. ఎక్కడేనా 'మంచిపాట' రాస్తే ఆ సంగతి నాకు తెలిసిన రచయితలు, నిర్మాతలు చెప్పినదే. కాని తనకై తానెప్పుడూ చెప్పలేదు. క్లబ్బుసాంగ్‌నయినా, భక్తిపాటనైనా, హాస్యగీతినైనా - ఒకే అభిమానంతో రాసిన వ్యక్తి ఆరుద్ర. దేనిమీదా చిన్నచూపులేదు. 'రాయవలసివచ్చిం'దన్న బాధలేదు.

అప్పట్లో రికార్డింగు కంపెనీలు పాటలున్న రికార్డుని కాంప్లిమెంటరీగా కవికి పంపేవారు. అలా ఆరుద్ర పాటలున్న రికార్డులు చాలా చేరాయి. భాష తెలియని వాళ్ళు లేబుళ్ళు రాయడంతో ఇవి చాలా తప్పుల తడకలుగా వుండేవికూడా. రికార్డులు పాడే కండిషన్‌లో ఉంచడమన్నది చాలా కష్టమైన పని. అందుకని వాటిని పాత రికార్డులను సహితం కొత్తవాటి కంటే బాగా పాడించగల ఓర్పూ, నేర్పూ వున్న సినీ సంగీతం మీద అథారిటీ అనదగ్గ శ్రీ వి. ఎ. కె. రంగారావు గారికి ఇవ్వడం జరిగింది. నేను సినీగీతాల సంపుటాలు చేయాలనుకొని చెప్పినప్పుడు, సహాయ సహకారాలు అర్థించినప్పుడు ఆరుద్ర పాటల లిస్టు కంప్యూటర్ పుల్ అవుట్ తీసి యిచ్చారు. దానివల్ల సినిమా పేరు, సంవత్సరం, సంగీత దర్శకుడు, కవి మొదలైన వివరాలన్నీ తెలుస్తాయి. ఇవి చాలా అవసరం.

ఇక పాటల సేకరణ - గడ్డివాములో సూదిని వెదకడం లాంటిదే. దీన్ని గురించి చెప్పాలి. నేనీ సంకలనాలు తీసుకురావాలని, ఆలోచన చేస్తున్నానని విని, చాలా మంది సహాయం అందించారు. ముఖ్యంగా డాక్టర్ ఎమ్. రవికుమార్ (శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ) ఆరుద్రపై సమగ్ర పరిశోధన చేసి డాక్టరేట్ పొందిన ఎల్. సంగయ్య (ఉస్మానియా యూనివర్శిటీ) ఆరుద్ర పాటలన్నిటినీ పంపించారు. రమణ

అనే అభిమాని తాను ఎన్నో సంవత్సరాలుగా సేకరిస్తూ వచ్చిన ఆరుద్ర పాటల కేసెట్లు చాలా పంపించారు. వీరికి నేను కృతజ్ఞతలు చెప్పనక్కర లేదని భావిస్తున్నాను. ఎందుకంటే, వీరు నా కుటుంబ సభ్యులు. వీరి అభిమానానికి నేను వెల కట్టలేను.

ఇక ప్రొఫెషనల్ కలక్టర్లు వున్నారు. వీరు పాటల సేకరణకి 'ఎంతిస్తారు' బేరం చేసినవాళ్ళు. ఇలాంటి వారు ఆంధ్రలో చాలా మంది వున్నారని తెలుసుకోవడం ఒక కొత్త అనుభవం నాకు. 'ఇంతివ్వండి' అని రేటు నిర్ధారించుకుని డబ్బు అందుకుని అన్ని పాటలూ పంపని వారున్నారు. 'నీటిలో గేదెనిపెట్టి' బేరం చేసిన వాళ్ళూ వున్నారు.

వారికి నిరుపయోగమే అయినా సేకరణపై డబ్బు చేసుకోవాలని తాపత్రయపడడం తప్పుకాదు వాటి 'ప్రాచీన' విలువ అలాంటిది. 'మనకి దొరకని విలువ' అలాంటిదే. కాని మాటమీద నిలబడకుండా ప్రవర్తించడమే అనైతికం అనిపించింది. అందుకే నేను వారిలాంటి వారిని ప్రాధేయపడే పని చేయదలుచుకోలేదు.

ఆరుద్ర తన సినీ రచనా వ్యవధిలో దరిదాపు నాలుగువేలకు పైగానే పాటలు రాసి వుంటాడని అంచనా. అన్నీ సేకరించ గల్గడం అసంభవం. ఉన్నవాటినే కాలక్రమేణా విభజించి సంపుటాలుగా రూపొందించాలని నిర్ణయించుకున్నాను.

స్థానికంగా వున్నారు గనుక శ్రీ వి.ఎ.కె. రంగారావు గారు – విసుగు, విరామం, సమయాసమయం అని లేకుండా నేనడిగిన ప్రతి చిన్న అనుమానాన్ని నివృత్తి చేశారు. పి. రాజేశ్వరరావు గారు యీ సంపుటాలని విశాలాంధ్ర తరపున ప్రకటించడానికి ముందుకు వచ్చారు. ఇది వారికి ఆరుద్రపై గల అభిమానాన్ని, గౌరవాన్ని చెప్పక చెప్తూంది.

సినిమా పాటలకు తమ తమ ప్రత్యేక ముద్ర తెచ్చిన వాళ్ళు చాలా మంది వున్నారు. అంత్యప్రాస వుండే ఆరుద్రపాట, మనసుమాటవుంటే ఆత్రేయపాట, సమాజంం బాధ కన్పిస్తే అని సెట్టిపాట, కవితా భాషాప్రయోగాలు అలవోకగా ప్రవహిస్తే అది మల్లాది వారి పాట, పురాణ పోకడలు ధ్వనిస్తే – అది సముద్రాలద్వయం (తల్లితండ్రులు) పాట అని చాలా మటుకు అటూ ఇటూగా గుర్తు పట్టేయవచ్చు. కాని వినే వారి అంచనాలని వమ్ము చేస్తూ వీరిలోనే అన్ని పోకడలూ పోయినవారు వున్నారు. ఇదీ విశేషం. పాట పాత్రవల్ల, పాత్ర సినిమావల్ల జీవించడం – సహజం. కాని పాట తానేగా కూడా మనకల్గిన సందర్భాలూ లేకపోలేదు. అంటే దానిలో ఏదో సినిమా పాట పరిధిని దాటి జనాన్ని ఆకర్షించుకుంటుంది. వారి నోటపడి బ్రతుకుతోంది అనుకోవాలి.

ఆరుద్ర సినీగీతాలమీద నేనేదో తీర్పు ఇచ్చాను అనుకోవడం లేదు. నాకా అర్హతలేదు, ఆరుద్ర ఎప్పుడూ 'చాలా మంచి పాట రాశాను' అనలేదు. అనుకోలేదు. అలా అన్నదీ అనుకొన్నదీ అతని అభిమానులే. వారికే చివరికి, కవి ఋణగ్రస్తుడు.

విశాలాంధ్ర పి. రాజేశ్వరరావు గారు ఈ సంపుటాలని వెల్గులోకి తెచ్చే బా ఆప్యాయంగా స్వీకరించారు. వారికి మాటలతో కృతజ్ఞత తెలియచేయలేను.

ఆరుద్ర సినీగీతాల సంపుటాలని విడివిడిగా పేర్లు వుంటే బాగుంటుందని సూచించారు శ్రీ వి.ఎ.కె. రంగారావు గారు. నాకు నిజమే అనిపించింది. ఒకటి రెండు - అని వుండడంకంటే పేర్లుంటే - చదివే వారికి సౌకర్యంగా వుంటుంది. అందుకే వారినే సంపుటాలకి పేర్లు కూడా సూచించమన్నాను. ఈ పేర్లు వారు పెట్టినవే. అంతేకాదు శ్రీ రంగారావు గారు - 'ఆరుద్ర సినిమా పాటలు - ఒక విశ్లేషణ' అనే గ్రంథ రచన చేస్తున్నారు. వీలైతే ఆ పుస్తకాన్ని కూడా ఆరుద్ర వర్ధంతి నాటికి, లేకుంటే ఆగస్టు 31నాటికి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నాను.

ఆరుద్ర మూడవ వర్ధంతి జూన్ 4 నుండి ఒక్కొక్కటిగా యీ సంపుటాలు రావాలన్నదే నా ఆశ. మిత్రులు రాజేశ్వరరావుగారు పూనుకోకపోతే ఇది సాధ్యమయ్యేది కాదు.

నేను ఒంటి చేతిమీద ఈ సంకలనాల ప్రెస్ కాపీలు సిద్ధం చేశాను. వీటిలో పొరపాట్లు వుండచ్చు. చాలా పాటలు వచ్చి ఉండకపోవచ్చు. సహృదయులైన అభిమానులు ఎత్తిచూపితే - సవరిస్తాను. ఈ సంపుటాలని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

2003
చెన్నై

కె. రామలక్ష్మి



# ఒక్కమాట

ఈ ఐదవ సంపుటితో ఆరుద్ర సినీగీతాలు ముగిస్తున్నాను. ఇప్పటికే చాలా శ్రమపడి వీటిని సంకలనంలోనికి తేగలిగాను.

దీనిలో "సుందరకాండ" ప్రచురించకల్గినందుకు చాలా సంతోషంగా వుంది. ఎంతో అభిమానంతో ఇంకా టెలికాస్ట్ ప్రారంభంగాని యీ భాగాన్ని ప్రచురించుకునేందుకు అనుమతి ఇచ్చిన ఉషాకిరణ్‌మూవీస్ వారికి నేను కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. ఈ సుందరకాండ రెండు విధాల, నిజానికి మూడు విధాల ప్రత్యేకతలు సంతరించుకుంది. సుందరకాండ పూర్తిగా వచనం లేకుండా గేయంగా రాయడం ఇది ప్రథమం. ఇంత సుదీర్ఘమైన సినీగేయం రాయడం, రావడం మన దేశంలో ఇదే తొలిసారి. ఇది దాదాపు ఎనభై ఏడు నిమిషాల నిడివి కల్గివుంది. దీనిని నయనానందకరంగా బాపు చిత్రీకరించడం. వీనులవిందుగా ఎస్.పి., మనో మొదలైన అనేకమంది సుప్రసిద్ధ గాయకులు పాడడం, పుహళేంది స్వరపరచడం జరిగింది. చివరిగా – ఇది ఆరుద్ర రాసిన ఆఖరు గేయం. ఇన్ని విధాల ప్రత్యేకత కల్గిన దీనిని ప్రచురించకల్గినందుకు గర్వంగా వుంది.

ఆరుద్ర తన సినీ జీవితంలో రాసిన వేలాది పాటలలో నేను ప్రచురించినవి సగం కూడ పూర్తిగా వుండవు. అయినా కూడా నేను ఇక సినీగీతాలు సేకరించే పనిని వదలి వేస్తున్నాను. ఆరుద్ర అముద్రిత ఇతర రచనలపై దృష్టి నిలపాలని నిర్ణయించాను. అందులో ముందుగా "ఆంధ్రదేశపు నాట్య సంప్రదాయాలు" అన్నది ప్రెస్ కాపీ సిద్ధం చేస్తున్నాను. ఆరుద్ర వదలి వెళ్ళిన అసంపూర్తి రచనలు ముఖ్యంగా "శ్రీశ్రీ కథ", "ఆంధ్ర దేవదాసీల చరిత్ర" ఇతరత్రా చాలా వున్నాయి. వాటి నోట్స్, వివరాలు వివరణలు అన్నీ వున్నాయి. వాటిని పెట్టుకుని పూర్తి చేసే ప్రయత్నం చేయాలనుకుంటున్నాను.

ఈ సినీగేయ సంపుటులలో లోటుపాట్లు, పొరపాట్లు విజ్ఞులు నా దృష్టికి తెస్తే – సవరించే ప్రయత్నం చేస్తాను.

కె. రామలక్ష్మి

# ఇందులో...

★ ★ ★

# ఆరుద్ర సినీ గీతాలు
# 5 సంపుటాల్లో...

**ఆరుద్ర సినీ గీతాలు (1950-1959)-1**
**వలపుల కథకిది తొలిపలుకు 75-00**

**ఆరుద్ర సినీ గీతాలు (1960-1964)-2**
**తళతళా-మిలమిలా పగటిపూట వెన్నెలా 75-00**

**ఆరుద్ర సినీ గీతాలు (1965-1970)-3**
**నవ్వుల నదిలో పువ్వుల పడవ 75-00**

**ఆరుద్ర సినీ గీతాలు (1971-1976)-4**
**సెలయేటి గలగలా చిరుగాలి కిలకిలా 100-00**

**ఆరుద్ర సినీ గీతాలు (1977-1998)-5**
**కురిసే చిరుజల్లులో 75-00**

# జరుగుతున్నకథ-1977

సంగీతం: సత్యం

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం

తేనెకంటె తీయనైన
వానకంటె చల్లనైన
తెలుగుభాష యిష్టమే – మేష్టారు
వేపకాయకన్న చేదు కరక్కాయకన్న కసరు
సిష్టమే కష్టమండి – మీ సిస్టమే కష్టమండి మేష్టారు
ఖర్మరా దేవుడా మా ఖర్మరా దేవుడా

తిక్కన పోతన రాసిన మంచి పద్యాలు
తలతిక్కన్న మేకపోతన్న
చెబితే ఒంటికి పట్టేనా
సినిమా పాటలా రంజుగా వుంటే
నోటికి పాఠం వస్తుంది
హోయ్ నోటికి పాఠం వస్తుంది ॥తే॥

గ్రామరు – గ్రామరు అంటూ గోలపెడతారు
మీ గ్రామరు కాదు గ్లామరు – మీ సంధంటే మాకు రంధి
చేతకాని పొడుంపట్టు మాచేత పట్టిస్తే–
తుమ్మితే ఫలితం మాష్టారు హచ్ ॥తే॥

★ ★ ★

# తొలిరేయి గడిచింది-1977

సృజనా కంబైన్స్ సంగీతం: సత్యం

**1**

**పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎస్. జానకి**

ఇదో రకం – అదో రకం
తలోరకం సొగసులే తనివి తీర్చేను
గాలి ముద్దులు వద్దంటావా
వేడి ముద్దులే యిమ్మంటావా ॥ఇ॥

నా కోసం రానే వచ్చావు
సగం సగం సిగ్గెందుకే
సొగసైన లేత పరువాలు
జిగేల్ జిగేల్ అనిపించవే

అహ మోహాల దాహాలు అందించనా
మురిపాల ఉయ్యాల ఊగించనా ॥ఇ॥

జవరాలు బెట్టు మానాలి
లేదంటే కథ మారేను

ఏయ్ – రా

మగవాడు ఎగిరే తూనీగ
మరో పూవు దరిచేరేను అహాఁ

సరసాలా సరదాలా తేలించనా
సరికొత్త రుచిలోన ముంచెత్తనా. ॥ఇ॥

★ ★ ★

# స్నేహం-1977

సాగర చిత్ర　　　　　　　　　　సంగీతం : కె.వి. మహదేవన్

## 1

**పాడినవారు: పి.బి. శ్రీనివాస్**

ఎగరేసిన గాలిపటాలు దొంగాట దాగుడుమూతలు
గట్టుమీద పిచ్చుక గూళ్లు కాలువలో కాగితం పడవలు

గోళీలు గోటీబిళ్ళా ఓడిపోతే పెట్టిన డిల్లా
చిన్ననాటి ఆనవాళ్లు స్నేహంలో మైలురాళ్లు

పడగొట్టిన మామిడికాయ – పొట్లంలో ఉప్పుకారం
తీర్థంలో కొన్న బూర

కాయ్‌రాజా కాయ్
కాయ్‌రాజా కాయ్

దసరాలో పువ్వుల బాణం – దీపావళి బాణాసంచ
చిన్నప్పటి ఆనందాలు చిగురించిన మందారాలు

నులివెచ్చని భోగిమంటా – మోగించిన గుడిలో గంటా
వడపప్పూ పానకాలు – పంచుకున్న కొబ్బరిముక్కా

గోడమీద రాసిన రాతలు – జీడితో వేసిన బొమ్మలు
చెరిగిపోని జ్ఞాపకాలు – చిత్తస్వాతి వానజల్లు

**2**

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

నవ్వు వచ్చిందంటే కిలకిల
ఏడుపొచ్చిందంటే వలవల
గోదారి పాడింది గలగల
దానిమీద నీరెండ మిలమిలమిల ||నవ్వు||

నది నిండా నీళ్లు వున్నా మనకెంత ప్రాప్తమున్నా
కడవైతే కడివెడు నీళ్లే గరిటైతే గరిటెడు నీళ్లే
ఎవరెంత చేసుకొంటె అంతే కద దక్కేది ||నవ్వు||

ధర తక్కువ బంగారానికి ధాటి ఎక్కువ
నడమంత్రపు అధికారానికి గోటు ఎక్కువ

కొత్తమతం పుచ్చుకుంటే గుర్తులెక్కువ
చేత కానమ్మకి చేష్ట లెక్కువ
చెల్లని రూపాయికే గీత లెక్కువ ||నవ్వు||

తమసొమ్ము సోమవారం – ఒంటి పొద్దు తింటారు
మంది సొమ్ము మంగళవారం ముప్పొద్దుల తింటారు
పరులకెంత పెట్టినదే పరలోకం పెట్టుబడి

నవ్వు వచ్చిందంటె కిలకిలా
ఏడుపొచ్చిందంటె వలవల
గోదావరి పాడింది గలగల
కథలెన్నో చెప్పింది ఇలాఇలా

# 3

## పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

పోనీరా పోనీరా పోనీరా పోతే పోనీరా
పోయింది పొల్లు మిగిలిందే చాలు

ఎంత మబ్బు మూసిన ఎంత గాలి వీచిన
నీలినీలి ఆకాశం అల్లాగే వుంటుంది

ఎంత ఏడుపొచ్చిన ఎంత గుండె నొచ్చినా
నీలోపలి ఉద్దేశ్యం ఒకలాగే వుండాలి

కష్టాలె కలకాలం కాపురముంటాయి
సౌఖ్యాలు చుట్టాలై వస్తూ పోతుంటాయి

వెళ్లాలి బహుదూరం – మోయాలి పెనుభారం
ఏమైనా కానీరా – మన యాత్ర మనం

## 4

**పాడినవారు: పి. సుశీల**

పువ్వు పువ్వు ఏమి పువ్వు
మల్లె పువ్వు! ఏం మల్లి
కొండమల్లి ఏం కొండ
బంగారుకొండ మా పాపబంగారుకొండ

పేదరాశి పెద్దమ్మ కుంకమెండ బోస్తే
సాయంత్రం ఆకాశం ఎర్రఎర్రనా
బుంగమూతి పెట్టుకున్న పాపకళ్లలో
రంగురంగు పూలుంటాయి పేరుపేరున

గులాబి పూచింది కొమ్మలేకనే
చామంతి పూచింది చిగురు వేయకే
మొగలి పువ్వు పూచింది మొగ్గలేకనే
పాపాయి అలిగింది ఊసుపోకనే

కొండమీది నుంచి కిందికి మొగ్గేయగలవా
ఊహూఁ
పిల్లి మొగ్గ వేయలేవా
మల్లి మొగ్గ వేయగలవా

తామర కమలం కలువ పువ్వులు
కలువ పూలకిందన సంపెంగ పువ్వులు
సంపెంగ పువ్వుకింద దొండపడ్లు
దొండపళ్లు తెరచుకొంటె మల్లెమొగ్గలు

ఏమిటో – చెప్పుకో!

## 5

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

సరె సరె ఓరన్నా సరెసరె
పిలిచి పిలిచి యింక వేధించనులే గుండె
కలచి కలచి నిన్ను బాధించనులె

వెర్రిగాలి వీచినపుడు వెదురైనా పాడుతుంది
నల్లమబ్బు పట్టినపుడు నెమలైనా ఆడుతుంది

నీనేస్తం నీ కోసం గావుకేక వేస్తే
పలకనైన పలకవు రాయిలా
ఉలకవు పలకవు ॥సరె సరె॥

అనుక్షణం నీ పేరే తలుచుకొంటాను
మనసులోన నీ వూసే మలచుకొంటాను
నీవే దిగి వస్తావని నిలచి వుంటాను
నీవు బాగుండాలని వేయిదేవుళ్ళను
కొలుచుకుంటాను ॥సరె సరె॥

★ ★ ★

# తూర్పువెళ్ళే రైలు-1977

త్రివేణి ఆర్ట్ పిక్చర్స్ సంగీతం : ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

వేగుచుక్క పొడిచింది
వేకువ కాబోతూంది
గాలిలోన తేలే నాదం
మేలుకొలుపు పాడింది ||వేగు||

కట్టుకున్న మంచుచీర – కరిగి జారిపోతుంది
ముసురుకొన్న చీకటిలో వెలుగు తోసుకొస్తుంది

దూరంగా నా నేస్తం తూరుపుబండి కూసింది
ఊరంతా మొద్దు నిద్రలో ముసుగుతన్ని పడుంది ||వేగు||

ఆశల వెలుగులు తూరుపు బండి
తీసుకుపోవాలి నన్ను తీసుకుపోవాలి

లోకంలోని వెలుగూ నీడా లోతులు చెప్పాలి
రేపటి రూపును లోపలి కళ్లను నేడే చూపాలి

రాసిన పాటకు ప్రాణంపోసి – పేరును తేవాలి
మంచి పేరును తేవాలి ||వేగు||

# 2

## పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

చుట్టూ చెంగావి చీర కట్టాలే చిలకమ్మ
బొట్టూకాటుక పెట్టి - నే కట్టే పాటను చుట్టి
ఆశపడే వేళల్లో ఊసులాడ వెన్నెలమ్మా

॥చు॥

తెల్లచీరకందం నువ్వే తేవాలి చిట్టెమ్మా
నల్లచీర కట్టుకున్నా నవ్వాలే చిన్నమ్మా
ఎర్రచీర కట్టుకుంటే సందె పొద్దు నువ్వమ్మా
పచ్చచీర కట్టుకుంటే పంటచేను సిరివమ్మా ॥చు॥

నేరేడుపండు రంగు జీరాడే కుచ్చెళ్ళ
ఊరించే ఊహల్లో తేలాడే పరవళ్ల
వంగపండు రంగులోన పొంగుతాయి సొగసుల్లు
వన్నె వన్నె చీరల్లోన నీ ఒళ్లే హరివిల్లు ॥చు॥

## 3

### పాడినవారు: పి. సుశీల

ఏమిటిది ఏమిటిది
ఏదో తెలియనిది
ఎప్పుడూ కలగనిది ॥ఏ॥

హత్తుకున్న మెత్తదనం – కొత్తకొత్తగా వుంది
మనసంతా మత్తు కమ్మి – మంతరించినట్టుంది
నరనరాన మెరుపుతీగె – నాట్యం చేసేస్తోంది
నాలో ఒక పూలతేనె – నదిలా పొంగుతోంది ॥ఏ॥

ఈడూ జోడూ కుదిరింది
తోడూ నీడ దొరికింది
అందానికి ఈనాడే అర్థం తెలిసొచ్చింది
పెదవి వెనుక చిరునవ్వు దోబూచులాడింది

చిలిపి చిలిపి తలపులు తలచి
సిగ్గు ముంచుకొస్తోంది – ఏమిటిది – ఏమిటిది
ఏదో తెలియనిది – ఎపుడూ కలగనిది
కలకానిది – ఏమిటిది ॥ఏ॥

## 4

### పాడినవారు: ఎస్.పి. శైలజ

వస్తాడే నా రాజు - వస్తాడే ఒకరోజు
రావలసిన వేళకే వస్తాడే
తేవలసినదేదో తెస్తాడే చిలకా ఓ రామచిలకా

నల్ల నల్ల మబ్బులు కమ్ముతుంటే
నా మనసు ఉయ్యాల ఊగుతుంటే
చిటపట చినుకులు కురుస్తుంటే
సిరి చిరి సొగసులు తడుస్తుంటే
మెల్లగా దొంగలా వస్తాడే- నా
కన్నులు మూసి పేరు చెప్ప మంటాడే ॥వ॥

మేళాలు తాళాలు మోగుతుంటే
బాజాలు బాకాలు రేగుతుంటే
ఊరేగే సంబరం చేస్తూంటే
తూరుపు బండిలోంచి దిగుతాడే - నన్ను
కోరికోరి పెళ్ళి చేసుకుంటాడే ॥వ॥

**5**

**పాడినవారు: పి. సుశీల బృందం**

కన్నె మా చిన్నారి కాపాడవమ్మా
నిండుగా మన వూరు నిలపెట్టవమ్మా
నీవు వూరేగితే నిలుచు వానల్లు
నీవు దయ చూపితే నిలుచు ఇట్టిల్లు ||క||

తలమీద అంటేము సంపంగినూనె
ఒంటిపై పూసేము చిరుబంతి పసుపు
ఇంటికొక కడవగా గంగపోసేము
కంటికొక వెలుగుగా హారతిచ్చేము ||క||

వాన వెలిసింది వరద తీసింది
అయిననూ మా మొక్కు మానలేమమ్మ
కాగడా చేపట్టి కడగంటి నవ్వుతో
కన్నె దిసమొలతో కదలి పోవమ్మా ||క||

★ ★ ★

# ప్రేమలేఖలు-1977

అన్నపూర్ణా పిక్చర్స్ సంగీతం: సత్యం

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

ఇది తీయని వెన్నెల రేయి
మది వెన్నెల కన్నా హాయి
నా ఊహల జాబిలి రేకలు
కురిపించెను ప్రేమలేఖలు ॥ఇది॥

నడి రాతిరి వేళ నీ పిలుపు
గిలిగింతలతో నను ఉసి గొలుపు

నును చేతులతో నను పెనవేసి
నా వడిలో వాలును నీ వలపు ॥ఇది॥

నా మనసే కోవెల చేసితిని
ఆ గుడిలో నిన్నే నిలిపితిని

నీ ఒంపులు తిరిగే అందాలు
కను విందులు చేసే శిల్పాలు ॥ఇది॥

నీ పెదవులు చిలికే మధురిమలు
అనురాగము పలికే సరిగమలు

మన తనువులు కలిపే రాగాలు
కలకాలము నిలిచే కావ్యాలు ॥ఇది॥

## 2

**పాడినవారు: పి. సుశీల, రామకృష్ణ**

విన్నానులే – పొంచి విన్నానులే

ఏమనీ

ఒక అమ్మాయి అమ్మ అవుతుందనీ
ఈ అబ్బాయి నాన్న అవుతాడనీ ||వి||

సుకుమారివి నువ్వు పువ్వులాంటి నువ్వు
పండులాంటి పాపాయిని యివ్వు
అలసి పోనివ్వను పనులు చేయ నివ్వను
అడుగుతీసి అడుగు వేయ నివ్వను

ఇంటి పనులు వంట పనులు తమరే చేస్తే
అయ్యగారి ఉద్యోగం ఉహూ హూ హూ ||వి||

పాపాయే గారాలతోట
మన చిన్నారే నా ముద్దుల మూట

అయ్యగారి వైపు పడదు నీ చూపు
ఇక ముద్దులన్నీ పాపకేనా రేపు

అంతలోనె వచ్చిందా తమకు అసూయ
అబ్బాయి తమ పోలిక ఆ ముద్దులు మీకే ||వి||

తొలిచూలు భాగ్యం ఎంతో ఆనందం
విడిపోని అందాల బంధం

నిజమైన స్వప్నం దిగి వచ్చిన స్వర్గం
పాపాయే మన ఆరో ప్రాణం

నవ్వులతో వెలుగులతో నిండును ఇల్లు
పాపాయి మురిపాలే – తొలకరి జల్లు ||వి||

★ ★ ★

# జీవనతీరాలు-1977

మారుతీ కంబైన్స్ 	సంగీతం: చక్రవర్తి

**1**

పాడినవారు: చక్రవర్తి

జీవన తీరాలు – నవ జీవనతీరాలు
జీవన తీరాలు నవజీవన తీరాలు
ఆశలుబాసలు – అడుగడుగున వేసే మజిలీలు ॥జీ॥

తెలిసీ తెలియని పరువంలో
విరిసీ విరియని ప్రణయాలు

చీకటి నుండి వెలుగులలోకి
సాగే – ఆగని పయనాలు – పయనాలు ॥జీ॥

తీయని తేనెలు వగరూ చేదూ
పొంగే స్నేహపు కెరటాలు

పెంచిన ప్రేమకు పెరిగే మమతకు
అంకితమయ్యే హృదయాలు ॥జీ॥

**2**

**పాడినవారు: పి. సుశీల**

నడిరేయి అవుతున్నా నిదురేల రాదు నీకు
విధి నన్ను వంచిస్తున్నా
కథ ముగియదేల నాకు...జోజో... ||న||

చేశాను ఒకటే పాపం – నీ పాలిట తీరని శాపం
ఈ చీకటి జీవితాన వెలగదురా ఆశాదీపం

గతి మాలిన లోకంలోనా
బ్రతుకంతా హాలాహలమే

కాకమ్మగూటిలోన పెరిగేను కోయిలకూన
ఉన్నావు నా వడిలోన చూడలేదు నిన్ను మీ నాన్న

ఏ దేవత కరుణించైనా
నిను చల్లగ చూసుకుంటే
నా తండ్రి – అంతే చాలురా
నడిరేయి.... ||న||

★ ★ ★

# ప్రేమించి పెళ్ళిచేసుకో-1977

మహేష్ ఎంటర్‌ప్రైజెస్ సంగీతం: సత్యం

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

పిటపిటలాడే వయసు
ఏదో గడబిడ చేస్తుంది

నచ్చిన మగవాడే దానిని
మచ్చిక చెయ్యాలి ||పి||

మనసైనవాడా మనువాడరావా

పిటపిటలాడే వయసు
నిను గడబిడ చేస్తాంటే
ఈ నచ్చిన మగవాడే దానిని మచ్చిక చేస్తాడూ

అందం తొందర పెడుతుంది....ఆ
ఎదలో ఏదో అవుతోంది...

వూహలు చిందులు వేస్తుంటే
ఉక్కిరి బిక్కిరి అవుతుంది
నేకరిగి పోనా ||పి||

సిగలో పువ్వు నవ్వింది హే హే
నీ చెంతకు నన్ను లాగింది.

పెదవుల నవ్వు వెలిగింది
వెచ్చని ముద్దు యిచ్చింది
మచ్చిక చేసుకొమ్మంది

కోయిల అవునని కూసిందీ
కొమ్మ చాటుకు పోయింది
ఈ ఏకాంత సీమ ఒకటౌదామా ||పి||

★ ★ ★

# మనుషులు చేసిన దొంగలు-1977

శ్రీ పద్మావతీ పిక్చర్స్ సంగీతం: సత్యం

**1**

**పాడినవారు: పి.సుశీల**

మనసెందుకో మమతెందుకో ఓ మోసగాడా
మనసే లేని మమతే లేని నీలాంటి మనిషెందుకో ॥మన॥

మనసారా. నమ్మానురా
నన్నమ్మి పోయావురా
నీ తోడు కోరానురా
నీ నీడ నిలిచామురా
తోడునీడ జాడ కూడా
లేకుండా చేశావురా ॥మన॥

తొలివలపు విలువేమిటో
నీ మనసు ఏ మెరుగురా
కన్నీటి కథ ఏమిటో
చినదానికే తెలుసురా
కన్నె మనసు గాయపరిచి జ్వాల రేపావురా ॥మన॥

**2**

పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

ఆనందం అబ్బాయిదైతే
అనురాగం అమ్మాయిదైతే

ఎడబాటు వుండదు ఏనాటికీ
ఇది నిజము ముమ్మాటికీ

నేను దొంగనైతే నువ్వు నన్నే దోచినావు

దోచీ దాచుకున్నా నేను నీకై వేచి వున్నా

నీ కోసమే నేను జీవించుతా

నీ గుండెలో నిదురించుతా ||ఆ||

నీవే రాధవైతే యీనాడే రాసలీల

నేనే వేణువైతే ఇక నీవే రాగమాల

అందాలసీమ బృందావనం

ఆ సీమలోనే మన జీవితం ||ఆ||

★ ★ ★

# దొంగలకు దొంగ-1977

త్రిమూర్తి ప్రొడక్షన్స్ సంగీతం: సత్యం

**పాడినవారు: ఎస్.జానకి**

కసికసిగా చూడకురా
కలికి మనసు ఉలికి ఉలికి పడెరా చిన్నోడా
వద్దురా గల్లాట ఆడర సయ్యాట ॥క॥

రంగుల చిలక బంగరు మొలక మనసురుచి
చూడని నవ్వు వాడని పువ్వు వయసు

కోడెకారు ఆడపిల్ల వేడిమీద వుందిగాని
పనస తొనల మనుపు గెలుచు – సొగసు దాచెరా

తళుకే తమాష కులుకే కులాస ॥క॥

మనిషా మొరటు మాటా బెళుసు ఒకరు
తన మనసే వెన్న వరసా మిన్న ఒకరు

ఇంతమంది చూస్తూంటే ఆగడాలు చేయవద్దు
ఎవరికెవరు తీసిపోరుగాని ప్రేమంటే
కాదురా మజాక చూపర తడాక ॥క॥

**2**

**పాడినవారు: ఎస్.జానకి**

ఓ ఎవరే మన్నను తోడు రాకున్నను
ఒంటరిగానే పోరాబాబూ పో

నీ దారి నీదే సాగిపోరా నీ గమ్యం చేరుకోరా
సాగిపోరా నీ గమ్యం చేరుకోరా ||ఎ||

నడచిన కందే పసిపాదాలు కోమలమైన మీ దేహాలు
వడివడిగా తడబడకా చేయాలెన్నో మజిలీలు

దూరమెంతైనా భారమెంతైనా ఆగకుండ పోరాబాబు పోరా
నీదారినీదే — సాగిపోరా — నీ గమ్యం చేరుకోరా ||ఎ||

మదిలో జ్వాల రగిలిననాడు లోకం చూపదు నీపై జాలి
నీలో నీకు నమ్మకముంటే జగతిని నీవే మార్చాలి

ఎంత బాధైనను వింత గాధైనను కన్నీరేరా — పోరాబాబూ పో
నీ దారి నీదే సాగిపోరా — నీ గమ్యం చేరుకోరా ||ఎ||

## 3

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

ఎవరేమన్నా తోడు రాకున్నా ఒంటరిగానే
పోరాబాబూ – నీ దారి నీదే
సాగిపోరా నీ గమ్యం చేరుకోరా ॥ఎ॥

పసితన మందే నలిగిన హృదయం
నోచదు పిడికెడు – ఏ మమకారం

కాలిన ఇల్లు ఆరెనుగాని ఆరదు మదిలో ద్వేషం
గుండె దిటవున్నది కండబలమున్నది

ధర్మం కోసం పోరాడు బాబూ పో
నీ దారి నీదే – సాగిపోరా నీ గమ్యం చేరుకోరా ॥ఎ॥

ఇతరుల బాధ తొలగించాలని శపథం చేసెను నీ ఆదర్శం
నవ్విన లోకం రువ్వను రాళ్లు అయినా వీడకు లక్ష్యం

పోరుసాగించరా – పేరు నిలబెట్టి పేదలకోసం – పోరా
నీ దారి నీదే, – సాగిపోరా నీ గమ్యం చేరుకోరా ॥ఎ॥

చల్లని వెన్నెల కాచే వేళా జాబిలి తారను చేరేవేళ
జిత్తులమారి నక్కలు కొన్ని చాటుగ పన్నెను కుట్ర

నువ్వు సింహానివి
లేచి పంజా విసిరి
పోరా బాబు పో
సాగిపోరా – గమ్యం చేరుకోరా ॥పో॥

★ ★ ★

# అమరదీపం-1977

గోపీకృష్ణా మూవీస్ సంగీతం: సత్యం

**1**

**పాడినవారు: రామకృష్ణ, రమోలా**

అంతలేసి అందాలు దాచుకున్న అమ్మాయి
అడిగింది కాదనకు కాసింత పారేస్తే
అరిగిపోతావా తరిగిపోతావా ||అంత||

కోడెవయసు చూడు వేడి మీద వుంది
నీ కొంగు తగిలి పొంగుతూంది
ఈ పెంకి మనసుపొగరు - నీ బింకంలో వగరు
అవి జోడిస్తే ఎంత జోరు
ఒకసారి నీవూ పెనవేసి చూడు
నన్నింక వదలి పోవు ||అంత||

నీ బారెడేసి కళ్లు - ఆ దబ్బపండు వళ్లు
సన్నబొబ్బ ఉసికొల్పేను
పట్టరాని మనసు నువ్వు పగ్గమేయవద్దు
ఈ పరవశాలె ఎంతో ముద్దు
పడుచు వయసులోనే అనుభవించు అన్నీ
ఇదిపోతే రాదు మళ్లీ ||అంత||

నీ కంటి చూపులోనే ఎంత వుంది కామం
అది పెంచుతూంది నాలో దాహం
ఆడతనం నీలో అణువణువున వుంది
అదినా గుండె లాగేస్తూంది
నువ్వు నేను జంట పండిందే పంట - ఇక నీతోనే వుంటా||అంత||

★ ★ ★

# ఈతరం మనిషి-1977

పల్లవి ఆర్ట్ పిక్చర్స్ సంగీతం: చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

నవనవలాడే జవరాలు చెవిలో ఏదో చెప్పింది
ఊహకు అందని ఆనందం ఉక్కిరి బిక్కిరి చేసింది

ఓమై డార్లింగ్ ఐ లౌ యూ - ఐ లౌ యూ
ఎర్రని పెదవుల మీద తెల్లని నవ్వుంది ||న||

ఆహా
తెల్లని నవ్వులలోన చల్లని వలపుంది

చల్లని వలపు నాలో వెచ్చగ వెచ్చగ మారి
ఏదో అల్లరి చేస్తోంది ఏదో తొందర పెడుతూంది ||న||

పగలే వెన్నెల కాసి పండుగ చేస్తోంది
విరిసిన పూవుల తోట విందులు చేసూంది

చేయి చేయీ చేర్చి చిలకా గోరింకలల్లే
మనసూ మనసూ కలవాలి - మల్లెల చాటుకి పోవాలి ||న||

ఐ లౌ యూ

ఐ లౌ యూ

## 2

### పాడినవారు: ఎస్. జానకి బృందం

రావయ్యా ఓ తెలుగుబావా – దేఖోజీ బొంబాయివాలా
పొడుంగో మద్రాస్ మచ్చా – అందాలు మీ కోసం తెచ్చా
కులుకులు చూస్తే గుటకలు వేస్తావ్
ఇంపులు చూస్తే ఈలలు వేస్తావ్ ॥రా॥

అందమంతా విందు చేస్తే ఆశలన్నీ చిందులేస్తాయి
చెయ్యి జారిపోతే – ఆఁ చెయ్యి జారిపోతే
గడుసువాడా చిన్నబోతావ్ – వయ్యారమంతా నే ఒలికిస్తే
మైమరచి నువ్వు మత్తెక్కి పోతావ్

మా వూరొస్తే ఏమిస్తావ్ – మీ వూరొస్తే ఏమిస్తావ్
పట్టుకోక కట్టుకోను – సెంటు సీసా ముట్టుకోను

మల్లెపూవు కన్నా మల్లెపూవు కన్నా తెల్లనైన మనసును
రవ్వంత సేపు కవ్వించుమన్ను

నీ ముద్దూ మురిపెం నేను మరిచిపోను ॥రా॥

★ ★ ★

# ముగ్గురమ్మాయిలు మూడు హత్యలు-1977

విజయవాణి పిక్చర్స్ సంగీతం: కె.వి.మహదేవన్

**1**

**పాడినవారు: పి. సుశీల**

అలల మీద కలల మీద ఆశపడనేల
ఆడవారి నడక మీద ఆశ పడనేల
సూటు మీద కోటు మీద – చూపు నిలిపి మరిచిపోయి
మిడిసి పడనేల తుదకు చెడనేల ॥అ॥

ఒక్క మారుగ రెప్ప తెరచిన – గొప్ప తెలిసేనా
చెక్కిళ్ళ పైనా చెయ్యి వేయక – గుండె పొంగేనా
నిట్టనిలువుగా సాగబడినా – నిజమె బయలగునా
అందమైన మనసు చూడ పొందు చేసేనా ॥అ॥

## 2

**పాడినవారు: కె.జె.జేసుదాసు**

అందాలపూలు ముడిచి
అరకాసు బొట్టుపెట్టి
పట్టీలు కాళ్ళకట్టి – పసిడి వలపు సాగేనులే
పంచె వన్నెల చిలకా
పడుచు గోరువంకా
వంపులతో నడిచింది సన్నజాజి మొలక ||అ||

మల్లెకూన పూచి సెలయేటి గట్టున మెరసె
మెల్ల మెల్ల నడయాడే పిల్లలేడి మురిసె ||అ||

ఆగమన్న వేగం తమ అంద వున్న మోహం
కాలు నిలువలేని బుల్లి – కంటి రెప్ప బాణం

ఆడది పుట్టే దాక మగాడి కొరకే లే
అందాల ఆభరణం – తాళిబొట్టా కటేలే ||అ||

**3**

**పాడినవారు: ఘంటసాల, పి.సుశీల**

ఎన్నెన్ని తీరుల ఏదేదో తలచెను
వేడివేడి కోరిక లేత వలపే
ననుపాడ మన్నది పాటలు – లేతవలపే ॥ఎన్నెన్ని॥

ఆనాడు తిడితే వినలేదే
కన్నె అందాలకే ఉలికి పడలేదే
నీ కన్నారగాంచిన బ్రతికితిని
నేడు రాగల బడిలో వొరిగితిని ॥ఆనాడు॥

ఇన్నాళ్లు శయినించె భావములు
కాని ఈనాడు మేల్కాంచె పరువములు
అనురాగాల గీతాలు కలిసేను
నేడు రాణించి నీ పాట మురిసేను ॥ఆనాడు॥

బిరబిర యెదలింక మిళితమగు
ప్రియ మార ఆనంద భరితమగు
మిలమిల ఆశలె ధన్యమగు
మిసిమించి ప్రేమ పుణ్యమగు ॥ఆనాడు॥

ఒయ్యారి మొదవగ పూరించి పిలిచె
ప్రియులను కులుకుల లేత వలపే
ఇక విరిగాచి పండును లేత వలపే ॥ఆనాడు॥

## 4

**పాడినవారు: ఘంటసాల పి. సుశీల**

కురులే నలుపు కుంకుమ ఎరుపు
కూరిమి పసుపు తొలి వలపు

కురులే నలుపు కుంకుమ ఎరుపు
కూడిన క్షణమో మైమరపు ||కు||

ఇంపుగ కదిలే నీ రూపే
నా ఎదలో మెదిలి ఊసి గొలిపె

జోడుగ గూడి విహరించాలని
కోరిక కోరెను మదిలోనె ||కు||

చల్లని పాట మల్లెల బాట
పొంగెడు మనసే - పావనం - పావనం

చిలికెన అందం చెదరని అందం
కలిగిన కురులే - పావనం పావనం

కల ఫలియించు కథ వికసించు
కాలం గడిపెద నీతోటే

కుమిలేటపుడు కులికేటపుడు
నెలకొని వుందును నీలోనే ||కు||

## 5

**పాడినవారు: పి.సుశీల**

మోహన మీరోజు మోహనము
మురిపాలతో సుఖము గాంచుదము
మంజుల గీతాల మధుర భావాల
కన్నులతో కథలు పాడుదము ॥మో॥

కన్నుల పరువాలె వెలుగునులే
కోరి కాంచెడి స్వప్నాలె నిజముగులే
చెలినిటు లాలించు యిది అదను
మన తొలిరేయి చెలువాలు మొదలగాను ॥మో॥

చల్లని మేఘముల మెరిసెదము
మనం చక్కని లోకాల కులికెదము
చంద్రుని తారకల పోలెదము
ఎద సమ్మతి లీనమయి – మధువనము ॥మో॥

## 6

**పాడినవారు: పి.సుశీల**

కాలమనునది కరిగె కాంతిరేఖ మరుగుపడె
భగ్నమైన గుండె వలె పగిలినట్టి నౌక మునిగె ॥కా॥

క్రూర విధి తలచినది ఘోరమిటు చేసినది
కన్నె మది ఇచ్చితిని – గాయపడి కథ ముగిసె ॥కా॥

హృదయమనే గూటిలో ఇరువురకు స్థలమేది
ఒక ప్రియునకు ఒకతెయని – ఉడికి వెడలి పోయావె ॥కా॥

దేవతల దీవెన వలె వెలుగగ – నా వలపు
అమర సీమల చేర్చవా –
బాధల జలపాతాలాగవా –
తల్లి గోదావరి వడిలో నన్ను చేర్చవా ॥కా॥

★ ★ ★

# మల్లెపూవు-1977

సమితీ ఆర్ట్స్ సంగీతం: చక్రవర్తి

**1**

**పాడినవారు: చక్రవర్తి**

మాలీష్ మాలిష్
జింజింజింబాంబ అరెహో - మాలిష్
రాందాస్ మాలిష్ లిమ్నాయిల్ మాలిష్
ఛాలెంజి మాలిష్ చాన్నాళ్లు సర్వీసు
రాందాస్ మాలీసండోయ్ మాలిష్ ||మా||

అరెహో - మాలిషు చేస్తుంటే బాలీసుమీద నువు తొంగున్న హాయుంటది
అరెహో< తలమీద చెయ్యేసి డుం డుం డుం
తలమీద చెయ్యేసి జంబాంబ దరువేస్తే
రంభొచ్చి రమ్మంటది -. అరె. ఒళ్లంత. జిల్లంటది
ఓహోహో అనిపిస్తది - అమ్మతోడు నిమ్మనూనె అంటగానె
తస్సదియ్య అబ్బోసి తబ్బిబ్బులే ||మా||

తలభిరుసు బుర్రయిన - మనసెయ్యి పడగానె
మహ తేలికైపోతది - పొద్దంత పనిచేసి ఒళ్లంత బరువే
మాలీసు మందౌతది - సంపెంగి నూనుంది రాజా
మహ సమ సమ గుంటది రాజా చెవులోన సమరేసి
చేయి మూసి గిలకొడితే - హమ్మ - హబ్బ-
సంగీతం వినిపిస్తదీ
సరిగమపదనిస.... సరిగమపదనిస.... ||జంబాయి||

## 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

ఓ ప్రియా
మరుమల్లియకన్నా తెల్లనిది
మకరందంకన్నా తియ్యనిది

మన ప్రణయం అనుకొని మురిసితిని
అది విషమని చివరకు తెలిసినది ||ఓ||

సఖియా
నీవెంతటి వంచన చేశావు
సిరిసంపద కమ్ముడు పోయావు

విడనాడుట నీకు సులభం
నిను విడవదులే నా హృదయం ||ఓ||

తొలిప్రేమకు ఫలితం కన్నీరు
విరహానికి ఫలితం నిట్టూర్పు

చెలరేగిన గాయం మానదులే
చెలరేగే జ్వాల ఆరదులే ||ఓ||

★ ★ ★

# మంచి మనుషులు-1977

జగపతి ఆర్ట్స్ సంగీతం: కె.వి. మహాదేవన్

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

విను నా మాట - విన్నావంటే
జీవితమంతా పువ్వుల బాట ||వి||

ఎన్నడు నీవు ఏడవకు - కన్నుల నీరు రానీకు
కష్టాలందూ నవ్వాలి కలకల ముందుకుసాగాలి

కంటికి వెలుగు యింటికి వెలుగు
ఆరని జ్యోతి నువ్వే నువ్వే ||వి||

బిడ్డలు ముద్దుగ పెరగాలి - పెద్దల ముచ్చట తీర్చాలి
ఆటలు హాయిగ ఆడాలి చదువులు పెద్దవి చదవాలి

ఇంటికి పేరు వూరికి పేరు
తెచ్చే వాడివి నువ్వే నువ్వే ||వి||

తల్లీ తండ్రీ ఒకరైనా దైవసమానం తల్లి సుమా
దీవిస్తుందీ మీ అమ్మ దేవునిలాగే కనపడక

చల్లని మనసు తీయని మమత
చక్కని బ్రతుకు నీదే నీదే

ఇది నీ మాట - విన్నానంటే
జీవితమంతా - పూవుల బాటా

★ ★ ★

# ఒకే రక్తం-1977

శ్రీవాణి ఆర్ట్ కంబైన్స్ 　　　　　　　　　　సంగీతం: సత్యం

## 1

పాడినవారు: పి. సుశీల, రామకృష్ణ

గుడ్ నైట్ వెరీ గుడ్ నైట్
స్వీట్ డ్రీమ్స్ మెనీ స్వీట్ డ్రీమ్స్

జోజో ఓ మై డార్లింగ్ గుడ్ నైట్

ఒంటరిగా పడుకుంటే తుంటరి చంద్రుడు చూస్తాడు
కిటికీ లోంచి వస్తాడు కొంటెతనాలు చేస్తాడు
జంటగ నేను సాయంవుంటే....వుంటే?

జగడం మనకి వస్తుంది 　　　　　　　　॥గుడ్॥

దోరవయసు అందాలు దొంగ చాటుగా చూడొచ్చా
తొందరపడుతూ దొరగారు చిందులు యిలాగ వేయొచ్చా

ఆలూ మగలూ అయ్యేదాకా అయ్యాక?
అయ్యేదాకా ఆశకు కళ్లెం వెయ్యొద్దా 　　　　　　　　॥గుడ్॥

మదిలో నన్ను కట్టేశావు – గదిలో కొస్తే నెట్టేస్తావు
పదిలంగా ఒక మూలపడుకుంటా ఏమంటావ్

లోనికి రానిస్తే – లోకం ఏమనుకుంటుంది 　　　　　　　　॥గుడ్॥

★ ★ ★

# ఆత్మీయులు-1977

సారథీ స్టూడియోస్ | సంగీతం: ఎస్. రాజేశ్వరరావు

**1**

**పాడినవారు: పి.సుశీల**

స్వాగతం ఓ చిరునవ్వుల శ్రీవారు
సొగకన్నులు సైగ చేస్తే ఆగలేనీ దొరగారు

కొంగు తగిలిందా పొంగి పోతారు
కోరి రమ్మంటే బిగిసి పోతారు

ఎందుకో ఎందుకో యీ బింకం

అలిగిన కొలదీ అందం అబ్బాయిగారి కోపము
పిలిచిన ప్రేయసికి ఇదేనా కానుక మీ కానుక

బెట్టు చాలును దొరగారు ॥స్వా॥

అందమంతా విందు చేస్తే అదిరి పడతారేం
పొందుగోరి చెంత చేర బెదిరి పోతారేం

సరసమో విరసమో ఈ మౌనము
అందిన చిన్నది చులకన అందనిదెంతో తీయన

అవతల పెట్టండీ తమాషా పోజులు - మహరాజులు
అధిక చక్కని దొరగారూ ॥స్వా॥

★ ★ ★

# రాణీరంగమ్మ-1977

మోడరన్ థియేటర్స్ సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి

**1**

పాడినవారు: ఎల్.ఆర్. ఈశ్వరి బృందం

జల్లివేయండి డబ్బులు జల్లి వేయండి – నా
తళుకులు చూస్తూ కాసులుతీసి జల్లి వేయండి

పెట్టి పుట్టిన మారాజా – నా
పైన కరుణ చూపండి – చేత
పైసలేనట్టి ఆసాములు వచ్చిన దారి పట్టండి

కళావరు జాకీ – మీద తురుపు
ఆఠీన్ రాణీతో కట్టేస్తా

తమ ఆఠీన్ రాణీ నీటును మురిసె
ఆసే వేస్తూ పట్టేస్తా

చీట్లాటలో పైకాన్నంతా
తుడిచి వేస్తావ మావ – ఒక

చెల్లని కాసు చెయ్యని బావా
చల్లగ వెళ్లుము నీతోవ ||జ||

## 2

**పాడినవారు: పి.సుశీల**

ఆకాశ వీధిలో అనురాగ జలధిలో
కలల జాలాలు పన్ననేల
ఏకాంతముగా వుండు ఆనంద కాలమిదే
నేడు వృధా చేయనేల

భామను కానరాదా - పూ బోటుల మన్మథుడ
నా భావం కనుగొని రావాలి చెరచరా
మోహాన్ని దాచువాడా ముక్కాలమరయువాడా
ముక్కు మూసుకొనే మహా మునివరా
ఇలా నిష్టచేయు కాలాన పిల్లగాలి వీచివస్తే
నెత్తికన్ను తెరచి కాల్చివేస్తారో

మహిళలే కారేని సుఖమన్నదియె లేదు
విచారం కలిగేనూ వికారం పుట్టేనూ
పాలపొంగు మేను చూసి జాలమేల చేయుట
భ్రమరమువలె తిరుగుతా పాడిపాడి ఆడుతా
కాలదన్ని పారాడండి కొమ్మ చేరవస్తేనే
చేరవచ్చెనే కొంచెం - కొసరవలెనండి

ఏం మునివరా నిష్ఠముగిసెనా
రోజా వెనకాల నారాజా వచ్చేన
సంతోషం ఎంతేనా ఉంటుంది - నాలోన

## 3

### పాడినవారు: పి.బి.శ్రీనివాస్, ఎస్.జానకి బృందం

ఓరచూపు కన్నంత ఒళ్లు
ఒళ్లంతా మురిసె పులకింత – అహహ

అన్నగారికి తెలిసె మాదిరి అనరాదయ్యా మామయ్యా – ఇటు
అన్నచెవులో అరచెవుడు

ఆఁ అర చెవిడివాడా
ఉష్ అన్న చెవులో
అర్థమైందా నోట్లో తవుడు

ఊ తవుడ మనీ – పొట్టవనీ

పోరా పోరా మొద్దబ్బాయి
వండేస్తా నిను మా మాయి

బొబ్బిలి రాజావి వస్తే దబ్బున మరులె ఇస్తాను
పబ్బము తీర్చని గోలగ పలికి సెచ్చెర విషయం తెలిపేశారె

ఆఁ వచ్చేరా

మానం పోవుటా మరియాదా
మాట మోటుగా అనమోకు

మూటా ముల్లెలో పుచ్చుకో
వడ్డి ధనం పన్నుధనం
పిల్లా ఇస్తానుగా
తళుకు బెళుకు అందాల వంటికి వడ్డాణం
అడ్డిగలూ వుంటే బ్రహ్మాండమూ

కళ్యాణ కార్యము జరుగుటకై అనువుగా
ధనముంటే కొంచెం పడేయండి

పెకం కావాలి కదూ!

అంతేగదూ మరి

అయ్యో ఇంపుగ యిస్తా

నేను చెంప మీదేస్తా

అమ్మయ్యో

కన్నె పిల్లలా నాణ్యం దోచీ
పాడు చేయకు - దేశపు ధర్మం దాటకు

నీతిమరిచి ఇక ద్రోహము చేయను
నీదు ప్రాణములు ముగిసేరా

అది ఒంటికి ఆపత్తు
ఒరేయ్ దూకరాదు హద్దు
నువ్వు బాగా నడుచు కొందుకే - ఈ గుద్దు

అబ్బా అయ్యో పొట్టలో కొట్టకండయ్య

**4**

**పాడినవారు: పి.బి. శ్రీనివాస్, ఎస్. జానకి**

కలలు తరించు విభావరిలో
కమ్మ తెమ్మెర వీచినదే
ఆశ మనసున ఆడునే
ఆడుట కారణ మేదో

కథలు మారె నా మదిలోన
కళకళా శుభ సమయాన
వలపు వీచిక తావుల ముసిరే
చెలియ తనివి తీరె

ఆశ మనసులో ఆడునే
అమర కావ్యమై పాడునే

## 5

**పాడినవారు: పి.బి. శ్రీనివాస్, ఎస్. జానకి**

ఎనలేని వేదన వినుమా - మనసై శపించె దైవం
కన్నీటి కాలువ కనుమా

చెలులే ఇలా వేరాయే
చెలిమి శుభాంతమే కాదో
కనిపించే మార్గము లేదో

చుక్కాని లేని ఆస పెను
సుడిలో నశించి పోనా
మురిపాలు సంబరాలు - కలనైనా తీరదేమో
సంద్రాన సాగు ఓడ - ఇక చేరునా ఆ తీరం
సుఖ జీవనం - కడు దూరం

చెలి లేదు జీవితాన
విరితావి వీడి పోయె
తలపోయు ఆశలన్నీ
ముగిసేను నీవు రావా
చేసేన నేను దోషం - ఇక
చేరావాతీరం - సుఖ
సుఖజీవనం కడుదూరం

## 6

### పాడినవారు: ఎస్.జానకి బృందం

జయం నొసగు దేవతా
శుభం నొసగు దేవతా
జయా విశుద్ధమైన జ్యోతి యే
కాపాడెడి దేవ – కాళికా

హేమాతా నా తల్లీ
నీ పాదం నమ్మినానమ్మా
సత్యమునే లక్ష్యముగా – చేరనియ్యవే
పరాశక్తి అన నీవేకద
లోపమేమి లేకుండ – కామనల
తీర్చుకున్న అంబా కొలచేమే దినం

స్వతంత్ర శూన్య దేశమే
మహాంధ కార బంధురం
మా మదిని వెల్లి విరియు వెలుగువై
ఈ వెత తీర్చవే దేవత

హేభవానీ లోకమాతా
ఆశయాల విజయ మీయగా
పరాశక్తె యన నీవేకదా

## 7

### పాడినవారు: ఘంటసాల, పిఠాపురం

శూర బొబ్బిలి సీమందునా చివురు కొమ్మ చేవగదా
గగురు పాడిచే పోరాటమూ కథ విందాం పుణ్యమమా

పరదేశ ప్రభువులంతా పేరంటే భయపడర
పటాలపు వీరులంతా పడిపడి దండాలు పెట్ట
ఆపై లోకపు శూరులే – బంగరు సీమలోనా
పచ్చిరక్తం చిందించగనో – బాలకులై పుట్టారట

దొరలో దొర వెలమ దొర – మన మన్నె దొర
వానితో సరియగునా బుస్సీదొరా ॥రా॥

టుప్పాకి తోడ వచ్చి బేటికి చెదరిస్తా
కబురు చేసెనే బుస్సీదొర

ఆ కబురు చెప్పిన వేగులాళ్లను
వెళ్లగొట్టెను వెలమీదొర ॥దొరలోదొర॥

సంధి కాని పగ – పోరాలు తన్ను పట్టి ఖైదు చేయుగ
ఏంటి చేసె?

ఎవరు?

ధర్మారావు ఏంటే చేస్త

ఆంధ్ర ధర్మాన్ని పౌరుషమ్ముల
గరిమెను చూపెను వెలమ దొర

మన్యాల చక్రవర్తి ఎనలేని వెలమదొర
పోరాడగా తలపెట్టాడయా వాని చుట్టాల్ కూడ వచ్చిరి

కోట తనువు పోలేను విడువమని

కోటలోని భేరీస్త్రీలు లేచి వచ్చిరి

లేచి కత్తి ఈటె బల్లెములు పట్టుకొనిరి

బలం చాటి స్త్రీలు లోని కోటకొమ్ము కాచిరీ

అది పరికిస్తా ఫ్రెంచి వాడు బెంగపడెను

ఫ్రెంచివాడి సేన అపుడు కొంచె మాయెను
వాడు బెంగపడి మందుగుండులో వేటలాడినాడే
మనిషి వేటలాడి నాడే – వాడు వేటలాడినాడే

మిన్ను విరిగెనో – భూమి పగిలెనో – యుద్ధములో – కోట
అయ్యో వీరుల కొచ్చె మరణమ్ము

కోట లోపలి మగువ లందరూ ఉరిని పోసుకొనిరి
విధిచే - ఉరిని పోసుకొనిరీ - కొందరు గొంతు కోసుకొనిరి

ఓడుట కన్నా యుద్ధములోపల మరణమైన మేలు
పగవానికి చిక్కుట తెలుగుచరితలో జరగబోదు ఎపుడూ

జగమేలే మన రంగ రాయులు
బొబ్బిలి పులి మన తాండ్రపాపడు
విజయనగరపు వీరుడు రాజు
తెలుగు రాజులే నేలకూలిరి
ఐకమత్యం లేదయ్యో అయ్యో ఇది ఏల?
మన ఆంధ్ర వీరులు బలి అయిపోయినారయ్యో
మచ్చర మన్నది మంచిది కాదు - కోడి పందెమే కోటను గూల్చెను
పరాసు వాళ్ల మాయల జిక్కి
మరణ దేవత పాలను బడిరి

ఐకమత్యం లేదయ్యో! అయ్యో ఇది ఏల
మన ఆంధ్ర వీరులు బలి అయినారయ్యో
ఇది ఏల?

## 8

### పాడినవారు: పి.బి. శ్రీనివాస్ బృందం

వచ్చినది నీ జనులే
సత్తెమున్న పోలేరమ్మో

సత్తెమున్న పోలేరమ్మో సత్తెమున్న పోలేరమ్మో

నువ్వు మహిమ చూపవమ్మ జాతర చేయించి ॥స॥
కనుచాటు పోవలదే - పండుగలు పానకము ॥స॥

ఫలితమ్ము మనకెరిక కనరారో తనవారే ॥స॥

నీ మహిమ చూపవమ్మ తోవుంది బయిలెల్లు ॥స॥

కోవిల్లో కొలువుండు - మా వీధుల సాగు చూడండ
పదవేల వేగిరాన ॥స॥

## 9

**పాడినవారు: పి. సుశీల**

నాటి రోజు ఏలరాదో కోరుకొనిన శోభతోను
గోము తీరా వుందు రోజు ॥నా॥

ఉదయము కాదో తెరువు లేదో
దేవత కరుణచె తెలవారె
పులకరించుతూ వారు నేను
పూల మార్గమున నడచి వెళ్లుటకు ॥నా॥

ఎదలో ధరించి ఎపుడు తలంచె
వారి పాదములు వరించి
నోచుచున్న నోము చేత
హృదయ మందె మెదలు ఆశ వెన్నెలగు ॥నా॥

వరద వాగులా వెతలు రేగ
వెల్లువలో మనసు మునిగె
ఇంక వేకువ భానుడు తోచి
ఇంపు మీరుతూ మురిసే ॥నా॥

## 10

### పాడినవారు: పిఠాపురం, జయదేవ్ బృందం

జనక జనక జంజనకిడి జనక జనక జింటాన్
శత్రువైనగానీ చిక్కేనేని
సత్కారమే చూపు జాతి మాది - అవును

కొల్లగొట్టగ మాదు ఎల్ల దాటి వచ్చు
క్రూరమ్ముల శిక్షించు గొప్పరాణి - తన
నిజప్రజలను కాచు మంచి రాణి ||జ||

మధ్యాహ్న సూర్యుండు వనితలా మారెనన
కయ్యాన శంరాగ్రణీ రాణి వయ్యారి లలనామణీ

మంచితనం పాలిట మగువ మల్లె - చెడ్డ
పన్లు చేయు గుంపులకు పిడుగు మల్లే
త్యాగముల దీవెనలు పూలనగ - కంచు
కంఠాన అమిరిన వనమాల పోరాడు వైరినా మన్నించం
శౌర్య మందు పేదనా కోపించం
శత్రువులు తిరిగి పోరాడగ - రాణి
చిత్రవధ వధియించు వీరాంగనా

★ ★ ★

# చదువుకున్న అమ్మాయిలు-1977

అన్నపూర్ణా పిక్చర్స్ సంగీతం: ఎస్. రాజేశ్వరరావు

**1**

**పాడినవారు: ఘంటసాల, పి.సుశీల**

ఆడవారి కోపంలో అందమున్నది అహ
అందులోనే అంతులేని అర్థమున్నది
మొదటి రోజు కోపం – అదో రకం శాపం
పోనుపోను కలుగుతుంది బలే విరహతాపం

పడుచువాని మిడిసి పాటు పైన పటారం
ఒక గడుసుపిల్ల కసరగానె లోన లొటారం
వగలాడి తీపితిట్టు తొలివలపు తేనెపట్టు ఆ
తేనెకోరి చెంతచేర చెడామడ కొట్టు

బ్రహ్మచారి లేత మనసు పైకి తేలదు – తన
మాటలందు చేతలందు పొత్తు కుదరదు
పెళ్లికాని వయసులోని పెంకిపిల్లలు – తమ
కళ్లతోనె మంతనాలు చేయు చుందురు

వేదుకున్న రోషం అది ఉట్టి పగటి వేషం
వెంటబడిన వీపు విమానం

చిలిపి కన్నె హృదయమెంతొ చిత్రమైనది – అది
చిక్కు పెట్టు క్రాసువర్డు పజిల్ వంటిది

ఆ పజిల్ పూర్తి చేయి – తగు ఫలితముండునోయి
మరుపురాని మధురమైన ప్రయిజు దొరకునోయి

## 2

**పాడినవారు: ఘంటసాల**

గుట్టుగా లేత రెమ్మల కులుకు నిన్ను
రొట్టెముక్కల మధ్యన పెట్టిరనుచు ఏల
యిటుల బంధింతువే టొమెటో
అతివలిద్దరి మధ్య నాగతిని గనుమ.

ఒకటే హృదయంకోసం
ఇరువురి పోటీ ద్వేషము

ఒకరు సత్యభామ ఒకరేమొ రుక్మిణి
మధ్య నలిగినాడు మాధవుండు
ఇద్దరతివలయిన ఇరకాటమేలనయా
విశ్వదాభిరామ వినురవేమ

జతగా చెలిమి చేసిరి
అతిగా కరుణే చూపిరి
చెలిమే వలపై మారితే
శివశివ మనపని ఆఖరే

రాముని దొకటే బాణము
జానకి అతని ప్రాణము
ప్రేమకు అదియే నీమము
ప్రేయసి ఒకరే – న్యాయము

## 3

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

ఓహో చక్కని చిన్నది - ఒయ్యారంగా వున్నది
ఊరించే కన్నులతో నన్నే చూడన్నది

చిన్నది చాలా మంచిది - నిన్నే నమ్ముకున్నది
నీవేతప్ప వేరెవరు లేరే లేరన్నది

వెచ్చని జవ్వని తాకితే - పిచ్చిగా వూహలు రేగునే
రెపరెపలాడే గుండెలలోన ప్రేమనిండేనే
అయ్యో పాపం.
తీరని తాపం.

భావకవిత్వం చాలునోయి పైత్యంలోన జారకోయి
పెళ్లికి ముందు ప్రణయాలు - ముళ్లబాణాలు ||ఓహో||

పెద్దల అనుమతి తీసుకో - ప్రేమను సొంతం చేసుకో
హద్దూ పద్దూ మీరినావో ఆటకట్టేను
యస్సంటారు మీ వాళ్లు
నో అంటేను తకరారు

తల్లీ తండ్రీ కూడదంటే - గుళ్లోపెళ్లి చేసుకొందాం
ధైర్యం చేసి నీవేగా - దారి చూపాలి

మనసే దోచిన సుందరి - మమతే మల్లెల పందిరి
పందిరిలోన మేనులు మరిచి - పరవశించాలి -
అప్పుడే కాదు.
ఎప్పుడంటావు?

తొందరలోనే మూడు ముళ్లు అందరిముందూ వేయగనే
తోడూ నీడె కలకాలం సాగిపోదామా ||ఓహో||

**4**

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

నీకో తోడుకావాలి. నాకోనీడకావాలి
ఇదిగో పక్కనుంది – చక్కనైన జవ్వని
నన్నే నీదాన్ని చేసుకోవాలి.

నవనాగరిక జీవితాన తేలుదాం
నైటుక్లబ్బులందు నాట్యమాడి సోలుదాం

నువ్వు అందమైన టిప్పుటాపు బాబువి
నేను అంతకంటె అప్టుడేటు బేబిని

వగలాడి నీకు తాళి బరువు ఎందుకు
ఎగతాళి చేసి దాని పరువు తీయకు
ఓ తల్లీ దయ చేయి – కోటి దండాలు

నేను పేరు పడిన వారి యింట పుట్టి పెరిగాను
ఏదో హారుమణి వాయిస్తూ పాడుకుంటాను
నేను చదువులేని దానని అలుసునీకేలా
నీకు కలసి వచ్చు లక్షలాస్థి విడిచి పోనేలా

మీతో వియ్యం దినదినగడం
మీ ఆస్థికోసం ఆత్మనేను అమ్ముకోజాల ॥నీ॥

ఓ తల్లీ దయిచేయి కోటి దండాలు.
సిరులూ నగలూ మాకు లేవోయ్
తళుకు బెళుకుల మోజు లేదోయి
చదువు సంస్కృతి సంప్రదాయాలు
తెలుగు తనమే మా రత్నహారాలు

ధనరాశి కన్న నీ గుణమే మిన్న
నీలో సంస్కార కాంతులున్నాయి

నీకో బ్రూటు దొరికింది
మెడలో జోలి కడుతుంది

ఆమె కాలిగోటి ధూళిపాటి చేయరు
ఓ, త్వరగా దయచేస్తే కోటి దండాలు

నీకో తోడు కావాలి, నాకో నీడ కావాలి
ఓహో పక్కనున్న చక్కనైన జవ్వనీ

నిన్నే నా దాన్ని చేసుకుంటాను.

**5**

**పాడినవారు: పి. సుశీల**

ఏమండోయ్ నిదుర లేవండోయ్
ఎందుకు కలలో కలవరింత
ఎవరిని తలచి పలవరింత
ఎదుటకురాగా ఏలయా మగత

ప్రేయసి నిద్దుర లేపుట - మోము చూపుట
పెళ్లికి తదుపరి ముచ్చట - ముందు జరుగుట చాల అరుదట
కమ్మని యోగం కలిసిరాగా
కన్నులు మూసి కపట మేలా
బిగువు బింకం ఇంక చాలండోయ్

యువతుల దగ్గర చేరినచో
యువకులు వురకలు వేసెదరే

కోరిన కోమలి చేరగనే
కులుకులు అలుసై పోయినవా
గురకలు తీసే కుంభకర్ణా నటన మానండోయ్

నేనే వలచి రానిచో చింత లేనిచో
నిదురే రాదని అంటిరి - బ్రతుక నంటిరి మోసగించిరి

నిద్రా దేవిని విడాకుంటే
ఉద్యోగాలు వూడు నండోయ్
ఇద్దరి ఆశలు యింక క్లోజండోయ్

## 6

**పాడినవారు: పిఠాపురం, వసంత**

ఏమిటి ఈ అవతారం ఎందుకు ఈ సింగారం
పాత రోజులు గుర్తుకొస్తున్నవి – ఉన్నది ఏదో వ్యవహారం

చాలును మీ పరిహాసం
ఈ సొగసంతా మీ కోసం

పౌడరు తెచ్చెను నీ కందం – ఇంకా వెయ్ వేలెడు మందం
తల్లోదు పూలని తలను పెట్టుకొని – తయారైతివా? చిట్టి వర్ధనం!

వయసులోన నే ముదురుదాననా
వయ్యారానికి తగని దాననా
వరస కాన్పులై వన్నె తగ్గినా
అందానికి నే తీసి పోదునా

దేవకన్య ఇటు దిగి వచ్చిందని – భ్రమిసి పోదునా కలనైనా
మహంకాళి నా పక్కనున్నదని – మరచి పోదునా ఎప్పుడైనా

నీరు కలపని పాలవంటిది – పిండి కలపని వెన్నవంటిది
నిఖారుసైనద్ది నా మనసు – పూరూవాడ ఇది తెలుసు

## 7

**పాడినవారు: పిఠాపురం, జిక్కి**

మెరుపు మెరిసిందోయ్ మామ – ఉరుము ఉరిమిందోయ్ మామ
సీకట్లో సిన్నదాన్ని ఇడిసి పోయవా మామ ॥మె॥

సలిసలిగా యీదురుగాలి
జడివాన జోరుగారేగె
గువ్వ పిట్టలాగ ఒణికేనన్ను
సూడుమా మామ ॥మె॥

వాన జల్లు పడతావుంటే
సలసల్లని కోరికలోస్తాయి
ఉడుకుడుకు టీ నీళ్లిస్తా
ఊసులాడుమా మామ ॥మె॥

మనసైనది పక్కన వుంటే
మగత నిదర తగునా మామ
కొసరి కొసరి నవ్వకుంటే
ఊరుకోనురా మామ ॥మె॥

★ ★ ★

# ఏజెంట్ గోపి-1978

త్రిమూర్తి పిక్చర్స్ సంగీతం: చక్రవర్తి

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల బృందం

ఓ హంస బలే రామచిలుక ఓలమ్మీ
తుర్రుమని ఉడాయించవే
ఓ హంస బలే రామచిలుక ఓ రబ్బీ
తుర్రుమని ఉడాయించరా

ఆళ్లో మళ్లో మముల మళ్లో
పదునారేళ్ల పిల్లా నువ్వు పలకనంటే ఎల్లా

నీకూ నాకూ డిల్లా పెట్టకు - పెట్టకు మల్లా
ఆశ పెట్టి మోసగించే వేషాలెందుకు కళ్లా

నే చింత తోపులో వుంటా - నువ్వు రాకపోతె తంటా
నను చూడు కడగంట పండించు వలపుల పంట
ఈడూ జోడూ బాగ కుదిరే నీదీ నాదీ చక్కని జంట.

## 2

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

ఉన్నసోకు దాచుకోకు ఉల్లి కోక – అది
ఉన్న చోటు దాచలేదు సన్నరైక – అది

కట్టుకోక అడిగింది – ముడి పెట్టుకోక
వెళ్లలేవు అడిగింది – ఇచ్చుకోక – ॥ఉన్న॥

నా చూపుకు తెలుసు ఆ లోపలి సొగసు
నా మనసుకు తెలుసు నీ దాగిన వయసు

కొండల నడుమ కోనొకటుంది
కోనకు నడుమ నీ కోరిన దుంది
గుట్టు మట్టు అవతల పెట్టు – అడిగిందిస్తే అవుతా జట్టు ॥ఉన్న॥

రుసరుసలాడే చిన్నదానా
అసలు విషయం దాచినదానా

బుసకొట్టే రూపం కనిపెట్టె కోపం
ఉసికొల్పేతాపం ఉడికిస్తే పాపం

కిక్కురుమనక పక్కకి వస్తే
తొక్కుడు బిళ్లాడించేస్తా
చెరువును పడితే నీవు చేపను
నా ప్రాణంలో గాలంవేస్తా – తప్పదులే ॥ఉన్న॥

★ ★ ★

# ఇంద్రధనుస్సు-1978

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

నేనొక ప్రేమపిపాసిని - నీవొక ఆశ్రమవాసివి
నాదాహం తీరనిది - నీ హృదయం కరగనిది ॥నే॥

తలుపులు మూసిన తలవాకిటనె - పగలు రేయినిలుచున్నా
పిలిచి పిలిచి బదులేరాక - అలసి తిరిగి వెడుతున్నా

పూట పూట నీ పూజ కోసమని పూలుతెచ్చాను
ప్రేమ భిక్షనే పెట్టగలవని దోసిలి ఒగ్గాను

నీ అడుగులకు మడుగులొత్తగా ఎడదను పరిచాను
నీవురాకనే అడుగుపడకనే - నలిగిపోయాను ॥నే॥

పగటికి రేయి రేయికి పగికే వీడ్కోలు
చెలరేగిన గుండెకి చెప్తునా - నీ చెవిన పడితే చాలు

నీ జ్ఞాపకాల నీడలలో నన్నెపుడో చూస్తావు
నను వలచానని తెలిపేలోగా నిదురై పోతాను ॥నే॥

★ ★ ★

# వయసు పిలిచింది-1978

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: పి. సుశీల**

నువ్వడిగింది ఏనాడైనా కాదన్నానా
నువ్వు రమ్మంటే ఎక్కడికైనా రానన్నానా
నీ ముద్దూ ముచ్చట కాదంటానా

సరదా పడితే వద్దంటానా హోయ్
నీ కోర్కెనే మరుమల్లెలా పిలిచింది నా సొగసు ॥ను॥

నీ పూజకీ కర్పూరమై వెలిగింది నా మనసు
దాచినదంతా నీ కొరకే

నీ కోరిక తీర్చే మరుమల్లెగ చేసి
నా ఒళ్ళంతా పూసేస్తూ వుంటే
నాలో ఏదో అవుతోంది ॥ను॥

నీ మగతనం - నా యౌవ్వనం శృంగారమే చిలికే
నీ అనుభవం నా పరవశం - సంగీతమై పలికే

పరుగులు తీసే నా పరువూ -
నా కథలే వింటే - నువుకావాలంటే - నా పాటే
నీ కినబడకుంది -
నీకూ నాకూ జోడంది. ॥ను॥

**2**

**పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం**

హే — ముత్యమల్లే మెరిసిపోయే మల్లెమొగ్గా
అరె ముట్టుకుంటే ముడుచుకుంటావే ఇంతసిగ్గా

మబ్బే మసకేసిందిలే — పొగమంచె తెరగా నిలిచిందిలే
ఊరు నిదరోయిందిలే — మంచి చోటే మనకు కుదరిందిలే

కురిసే సన్నని వాన అది సలిగా వున్నదిలోన
గుబులౌతుందే గుండెల్లోన జరగనా కొంచెం
నేనడగనా లంచం — చలికీ తలలు వంచ
నీ ఒళ్లే పూల మంచం — వెచ్చగా వుందాము మనము

పైటలాగ నన్ను నీవు కప్పుకోవే
గుండెలోన గువ్వలాగ వుండిపోవే ॥మ॥

పండే పచ్చని నేలా — అది బీడైపోతే యేలా — వలపు
కురిస్తే — వలపు తడిస్తే — పులకరించు నేలా — అది
తొలకరించువేళా తెలుసుకో పిల్లా ఈబిడియ యేలా
మళ్లా ఉరికే పరువము మనదీ
హే — కాపుకాస్తే కాయలన్నీ జారిపోవా
దాపుకాస్తే కోర్కె లన్నీ తీరిపోవా ॥మ॥

## 3

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

మాటే మరిచావే చిలకమ్మా మనసే విరిచావే
అంతట నీవే కనిపించి అలజడి రేపేవే - కమాన్ - క్లాప్

హల్లో మై రీటా పాడేవు సరికొత్తపాట - మారింది నీబాట
నీ పెదవులు చిలుకును మధురసం
నీ హృదయం మాత్రం పాదరసం

నాలో రేపావు జ్వాలా ఒకరితో పాడేవు జోలా
నను మరిచి పోవడం న్యాయమా - మనసివ్వవెందుకు
నమ్మవెందుకు - వలపు గుండెకే గాయాలా

కథలే మారెను కలలే మిగిలెను - హల్లో మై రీటా
ఏమైంది - నీమాట ప్రేమన్నది
దేవుని కానుక - అది నీకు వేడుక
కృష్ణుడు ఆశపడే రాధ -
రాధిక వేరుపడిపోగా - ఎడబాటు సహించదు - హృదయము

ఒకనాటికైనది - ఈ జీవితానికి కనరాక పోదూ
హృదయమా - నిజమే తెలుసుకో
గతమే తలుచుకో - గతమే తలుచుకో.

## 4

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

ఇలాగే ఇలాగే -- సరాగమాడితే
వయ్యారం - యీ యవ్వనం
ఊయల లూగునే - ఇలాగే ఇలాగే
వయ్యారం యీ యవ్వనం - ఊయల లూగునే

వయసులోన వేడివుంది - మనసులోన మమతుంది
మమతలే మారవుగా - మది మాటలేమో మనోహరం

మదిలో మెదిలే మైకమేమో.....
భావమే నీవయితే
పల్లవే నీ వయితే

ఎదలోన ఒకేస్వరం - కలయేమో - నిజం నిజం
పగలూ రేయీ ఏదో హాయి

జీవితం మధుశాల యౌవనం రసలీల
రేపటి మాటేల - నమ్ముకో యీవేళ
ఆ పెదవే మధుకలశం - అందుకో ప్రేమరసం
ఉల్లాసం - వచ్చింది మధుమాసం - నేనే నీ కోసం
జీవితం నీకువరం - బిగికౌగిలిలో దాచుకో శృంగారం

చక్కని చుక్క పక్కన వుంది
పక్కపై చుక్కే వుంది - చుక్క కూడ పక్కనె వుంది
పక్క కూడ ఫక్కుమంది - మక్కువంతా దక్కినని
కన్నులే కలుసుకొంటే వెన్నెలే వేడి కదా - స్వర్గమే చేరుకదా
ఇద్దరం ఒకటైతే - నిముషమే - కావ్యసుధా....

★ ★ ★

# విచిత్ర జీవితం-1978

శ్రీ ఉమాలక్ష్మి కంబైన్స్ సంగీతం: చక్రవర్తి

**1**

**పాడినవారు: పి. సుశీల బృందం**

అల్లి బిల్లి చిట్టిపాప
మనమందరం ఒకటే చిట్టిపాప

ఆడుతు పాడుతు చదవాలి
ఆ చదువే సంపద కావాలి

ఆవుల రంగులు వేరైనా – పాలది ఒకటే రంగు
పూలరంగులు వేరయినా పూజమాత్రం ఒకటే

ఎన్ని పేరులువున్నా దేవుడు మాత్రం ఒకడే
ఆ సత్యం తెలియాలి – సఖ్యత కలపాలి – ॥అ॥

గాలినేల నీరు నిప్పు – ఆకాశం
అయిదూ కలిసీ రూపొందెను ఈ భూగోళం

ఎన్నోజీవులు వున్నా మానవ జన్మే మిన్న
ఆ మనిషిగా బ్రతకాలి – మంచిని పెంచాలి ॥అ॥

సూర్యుని కిరణాలెంతో వేడిగ వుంటాయి
సముద్రపు నీళ్లు ఎండకు ఆవిరి అవుతాయి
ఆవిరి మబ్బులుకాగా వానలు కురియును బాగా
ఎండలు వుంటేనే వానలు పడతాయి
వానలు పడితేనే
చేనులు పండేది!
ఆహాఁ ॥అ॥

# దొంగల వేట-1978

త్రిమూర్తి ప్రొడక్షన్స్ సంగీతం : సత్యం

**1**

**పాడినవారు: ఎస్. జానకి, బృందం.**

ఓహో కాల సర్పం నేనే
ఓహో కామ తంత్రం నాదే ఓం ... హ్రీం.... స్వాహా
మహిమలు చూపే మాయల మారికి
లొంగని వాడున్నాడా.... వున్నాడా
చూడండి నా గారడీ - ప్రతి వాడు నా డింగరీ ||మహి||

డమిడమి డమిడమి డమరుక వాద్యం
గుండెలు పగిలే నాదం
కణకణ నిప్పుల కరాళ నృత్యం - కాళిక నాలో ఆవేశం
రేగిన మగాడు - నా ముందు రాలేడు
శివమెత్తి నేనాడితే - హడలేను ఈ లోకమే ||మహి||

శాకిని ఢాకిని - కామస్వరూపిణి నేనే
మనిషిని మార్చే మత్తును పెంచే - మంత్రం తంత్రం నాదే
సమయం రావాలి - సరసుడు కావాలి
సరైన మగవాడికే - స్వాధీన మవుతానులే ||మహి||

## 2

**పాడినవారు: పి. సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

ముందుంటే కుమ్మింది కోపం
నీ వెనకుంటే కమ్మింది తాపం
అరె ఏం చేయనూ - నేనెలా చావను

విరజాజి దండల్లే విరబూసి నువ్వుంటే
వెర్రెక్కి పోతుంది భామా
పసిడి నిమ్మ పండంటి మిసమిసలు చుస్తాంటే
ఊగి పోతుంది భామా
ఇది నా ముద్దంటే - అది నువ్వొద్దంటే
ఏం చేయను నేనెలా చావను.

చూస్తాంటే విరిగింది కోపం
చెయ్యేస్తుంటే పెరిగింది తాపం
అరె ఏం చెయ్యను - నేనెలా చావను.

★ ★ ★

# దొంగల దోపిడీ-1978

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

ఓహో ఆఘ మేఘాలమీద ఆహా స్నేహమే వెలుగు బాట
మెరుపు తీగెలా ఏకధాటిగా మునుముందుకె సాగిపోరా

బుసబుసపొంగే యౌవనముంది
చెదరని చెరగని బంధం

సత్యం ధర్మం సాహసముంది
ఆరవుగాలికి మన దీపాలు ఆగవు ఆజ్ఞకు మన వేగాలు

పడుచు తలపులకు గొళ్లెం లేదు
ఉడుకు గుండెలకు కళ్లెం లేదు

వాడిగ వేడిగ వయిసే వున్నా
బరువైా బాధ్యత గుర్తించాలి

గమనం చాలదు – గమ్యం ముఖ్యం
కాగల కార్యం సాధించాలి.

## 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం**

తప్పెట్లు మోగాయీ తాళాలే రేగాయి
సిరి మువ్వ చిందెయ్యరా–
చెంగల్వ పూదండ కృష్ణయ్యరా
రేపల్లె గోపాల దేవుడయ్యా

నింగి ఒంగిందీ – నేల పొంగింది
రంగు చిమ్మిందిరా – అంద మొలికిందిరా
రంగుల అంద మొలికిందిరా ॥త॥

ఓహో వేణుగానాలు – రాధ ప్రాణాలు
కలిసి పుట్టాయిరా
అహ కలిమి తెచ్చాయిరా – మనకు కలిమి తెచ్చాయిరా

మనిషి మనిషి దేవుడైతే
రోజా పండగేరా – లోటు ఏముందిరా ॥త॥

దశరూపుడై తాను – దిశలన్ని చాటాడు
నరుడే నారాయణుడని
పరులెవ్వరూ లేరనీ పరుడెవ్వడూ లేడనీ

పరహింస చేస్తుంటే చెరబట్టి దోస్తుంటె
పాపం చూస్తాడురా – కాసేపు వుంటాడురా
కాసేపు వుంటాడిలా

మనిషికి మనిషి దోపిడీ మూకైతే
అప్పుడు పుడతాడురా భరతం పడతాడురా ॥త॥

ఓ – వాన చినుకులే వాగులైతే
ఏరులు నిండాయిరా సిరులు పండాయిరా
ఓ గుండె బలముంటె కండ బిగువుంటె
ఎదురు నిలవాలిరా దోపిడి అణచాలిరా
సత్యమె శివమై సుందరమై భువిపై
నరుడైన గెలవాలిరా – విజయుడు కావాలిరా
నరుడే విజయుడు కావాలిరా. ॥త॥

**3**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం**

ఆ కొండ గుండెల్లో సూరీడు దూరాన
కోడి కూసేదాకా రాడోయి – గుండెల్లో ఈ పదుచు గుండెల్లో
చంద్రయ్య పొడిచి – పొమ్మన్న నిన్నుడిచి పోదోయీ
వాడివెంట పడుతుంది – గుండెల్లో గుబులుండి

గోరింక పాడింది చిలకమ్మ ఆడింది – తందాన తానా
అందర మొకట్టై అందామా – తందానా తాన

తండ్రీ కొడుకులనే తీపిరూపాలు –
అమ్మా నాన్నా వెలిగించే దీపాలు
నూరేళ్లు పండే పంటలురా – ఇవి

చావు పుటుకల జంటలురా, తందానా
అందామా అందర మొకట్టై వుందామా

కొండైనా బండయినా పిండయ్యి పోవాలి
చూస్తావా చూడు దెబ్బ

ఓయబ్బ కర్రయినా కత్తయినా చేత పట్టానంటే
గురుతొస్తాడే వాడియబ్బ – ఓ యబ్బో

తాడెక్కి నా డొకడు – తలదన్నేవాడొకడు –
అతని కంటే ఘనుడు – ఆచంట మల్లన్న

తందానా అందామా అందర మొకట్టై వుందామా

నింగీ నేలా రంగులు పొంగే ఉల్లాసం
గాలీ నీరూ పాడి పంటలు నీ కోసం

కష్టం చేసిన వాడికి అన్నీ సొంతాలు
ఆకటి చీకటి దోపిడీలు పాపాలు
దొంగలు ఎందుకు కావాలి దోపిడి ఎందుకు చేయాలి
హంసల్లే వుండాలి ఆరు మాసాలయినా
కాకల్లే కలకాలం ఎందుకురా
తందానా అందామా అందర మొక్కట్టై వుందామా ॥ఆ కొండ॥

# అనుకున్నది సాధిస్తా-1978

భాగ్యనగర్ స్టూడియోస్ సంగీతం : రమేష్ నాయుడు

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్.పి. శైలజ**

చూడనీ బాగా చూడనీ
చూసే కళ్లను చూడనీ

సన్నజాజి మీద చిలక సైగలేమో చేస్తోంది
పొన్న చెట్టుమీద గువ్వ పొంచి పొంచి చూస్తోంది

నా వయసు నీ సొగసు కలబోయనీ
కలగన్న మురిపాలు నెరవేరనీ
ఊరించు పరువాలు హోరెత్తనీ
అది చూసి పగవారి నోరూరనీ

అల్లీ బిల్లీ ఆనందాలు నీలోనాలో రేగనీ
కళ్లు కుట్టి కానివాళ్లు ఏదేదో వాగనీ

వాగనీ బాగావాగనీ – వాగే నోళ్లను వాగనీ

మనవ్యాసు ఎందుకో లోకానికి
ఆ ధ్యాస ఎందుకు మన జంటకి
పదిమంది కళ్లకు మన మిద్దరం

హృదయాలు కలసిన మన మొక్కరం
అందమైన నెమలి పిట్ట చిందులేవో వేస్తోంది
రాలుగాయి కోయిలమ్మ రాగాలు తీస్తోంది

తీయనీ బాగా తీయనీ తీసేవాళ్లను తీయని.

# నిండు మనిషి-1978

లక్ష్మీఫిల్మ్ కంబైన్స్ సంగీతం : సత్యం

**1**

**పాడినవారు: పి. సుశీల బృందం**

రామయ్య రామయ్య రారో – రాతిరి ఎత్తక పోరో
ఆకులు వక్కలు తేరో – నోరంత పండించుకోరో
ఆ ఎర్ర రంగే నా ఎర్రి సెప్పేను మామో ॥రా॥

నాగులేటి గట్టుకాడ – నాగమల్లి సెట్టుకాడ
సైగలు చేశావురో సన్నగ నవ్వావురో

మంగళారం మాపటేళ సెరువులోన తానమాడ
సీరెత్తు కళ్లావురో నా సిగ్గంత దోశావురో

ఆనాటి నుండి యీనాటిదాకా
ఎన్నెన్ని ఎన్నెన్ని చేశావు మామో ॥రా॥

కందిరీగ నడుముదాన్ని కలువరేకుల కళ్లదాన్ని
కవ్వించి పోయావురో నిన్ను కలుసుకోమన్నావురో

అంటు మామిడి తోటలోన – అంటుకాగి జంట కూడి
ఆశలు రేపావురో ఏమో బాసలు చేశావురో

నీమాట నమ్మి – నే కాసుకున్నా
రాకుంటే రానంటె నేసచ్చిపోతా మామో ॥రా॥

**2**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

తనయుడు పుట్టగానె – తన
తండ్రికి సంతస మయి జాలడా
తనయుడు కీర్తిలోన – తన
తండ్రిని మించిన నాడె నిక్కమౌ
తనివిని పొందు తండ్రియని

ధర్మమిదేయని చాటనెంచి నీ
తనయులచేత నోడితివి
దాశరధీ కరుణాపయోనిధీ

★ ★ ★

# గోరంత దీపం-1978

చిత్ర కల్పన　　　　సంగీతం : కె.వి. మహదేవన్

**1**

**పాడినవారు: పి. సుశీల బృందం**

చందమామరావోయ్ – జాబిల్లి రావోయ్　　　　॥చం॥

వోయ్.

చిన్నదాని బుగ్గ మీదుగా చిటికేసి పోవోయ్
చందమామ చందమామ ఓ చందమామ
అందకత్తె చూరకత్తె ఓ చందమామ
చుక్కల్లో ఒక్కడివే – ఓ చందమామ
నిన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి ఓ చందమామ

చిక్కుడాకుమీద చిలక వాలింది
చిలక కోసం ఓ మామ చిక్కి ఉన్నావా
ఊఁ

అరిటాకుమీద హంసవాలింది
ఆ హంసకోసం ఓ మామ అమిరి వున్నావా
మామిడాకు మీద మంచు వాలింది
మంచులోన ఓ మామ పొంచి వున్నావా
ఓ యెస్
గుమ్మడాకుమీద గువ్వ వాలింది
గువ్వ మాత్రం నీ కోసం గూడు వదిలి రాదు

అయ్యో అయ్యో అయ్యో
లబోదిబో లబోదిబో దిబో లబో అబ్బో　　　　॥చం॥

వన్నె వన్నెల చీర వాణిశ్రీ చీర
వాణిశ్రీ చీర నాకు కొనిపెట్టుతావా
ఓ యెస్
జాం అంటూ వుంది జయసుధ జాకెట్టు
జయసుధ జాకెట్టు నాకు కుట్టించు తావా
ఓ యెస్
జమున లోలక్కులు జయప్రద గాజులు
పేరు పేరు నగలు నాకు పురమాయిస్తావా
ఓ యెస్
వాణిశ్రీ చీరకట్టి జయసుధ జాకెట్ తొడిగి
అత్తారింటి కెడత అంపిస్తావా

అయ్యో అయ్యో అయ్యో
లబోదిబో లబోదిబో

కుర్రదాని కులుకు చూసి
గుటకేసి పోవోయ్ – చందా మామా
అహ! చందమామ పోవోయ్
జాబిల్లి పోవోయ్

**2**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

ష్ గోడకు చెవులుంటేనో – నో నో
ఈ మేడకు కళ్లుంటేనో నో నో
ఈ గోడకు చెవులుంటే
ఈ గుసగుస లింటాయి

ఈ మేడకు కళ్లుంటే
ఆ మిసమిస చూస్తాయి.

పిట్ట మనిషి లేని చోట ఎందుకు బెదురు
సిగ్గా బిడయాలిక్కడ చెల్లా చెదురు ॥గో॥

పువ్వులకే మాటలు వస్తే
నను తుంచమంటాయి జడలో వుంచమంటాయి

కాని మువ్వలకే పాటలువస్తే
నిను ఆడమంటాయి – నను చూడమంటాయి
గరిసనా .... నిసగరీ.... సనిసస్సా

ఇపుడు చప్పుడు చేయకుండ అత్తగారొస్తే
నువ్వు ఒత్తర పోతావ్వా నే కత్తులు దూస్తానా

చల్లని వెన్నెలకే కమ్మదనం వుంటే
అది నీ మనసౌతుంది

చల్లని కమ్మని కర్పూరానికి నున్నదనం వుంటే
అది నా సొగసౌతుంది.

చల్లని కమ్మని నున్నదనానికి
తీయదనం వుంటే
అది నీ మమతౌతుందీ

ఊ మనసు సొగసు మమత ఆలయమైతే
ఆహ దేవత వవుతావు – ప్రణయ దేవత వవుతావు

నల్లన్ని జడ చూడ నాగ సారమాయె
నాగ సారమూ మీద నంది వర్ధనము

నాగ సారమూదితే – నాగులకు నిద్ర
జోలల్లు రాజేంద్ర భోగులకు నిద్ర జోజో

మావారి కన్నులు తమ్మి పువ్వుల్లు
తమ్మి పువ్వుల్లోన కమ్మతేనియలు

కోరికల పాన్పుపై కొంగు పరిచాను
ఎవరు లేని చోట జోలపాడేను

## 3

### పాడినవారు: పి. సుశీల బృందం

హరి హరి నారాయణా ఆదినారాయణో
కరుణించి మమ్మేలు గరుడ వాహనుడ
లోగుట్టు పెరుమాళ్ల కెరుక
ఆ పెరుమాళ్ల గుట్టు ఈ పిల్ల దాని కెరుక ॥హరి॥

పాలసంద్రంమీద పవ్వళించే సామికీ
పొరుగిల్ల పాలెందుకూ ఆ దోపిడి బుద్ధెందుకు

పదహారు వేలమంది పెళ్లాలు కలవాడికి
అత్తమ్మ పొందెందుకూ – ఆ దోపిడీ బుద్ధెందుకు

అమ్మదొంగ అమ్మ దొంగ – ఆదీనారాయణా
నీ నమ్మరాని లీలలూ మాకూ పారాయణా

అక్కేస్కో ఒక్కేస్కో మీతాలకి రంగేస్కో
మాపక్కకు రావద్దు నారాయణ – వస్తే
డిక్కీలో పక్కేస్తాం నారాయణా ॥హరి॥

చేతగాని గోపికలు చీరలెత్తు కెళితే
చేతులెత్తి మొక్కారు నారాయణా

కలికాలం పిల్లదాని కొంగు పట్టిలాగి చూడు
కరుసై పోతావురో నారాయణా
నువ్వు కలికంలోకి మిగలవురో నారాయణా ॥హరి॥

**4**

**పాడినవారు: పి. సుశీల**

రాయినైనా కాకపోతిని రామ పాదము సోకగా
బోయెనైనా కాకపోతిని పుణ్య చరితము పాడగా ॥రాయి॥

పడవనైనా కాకపోతిని స్వామికార్యము తీర్చగా
పాదుకైనా కాకపోతిని భక్తి రాజ్యమునేలగా

అడివిలోపల పక్షినైతే అతివ సీతను గాచనా
అందువలనా రామచంద్రుని అమిత కరుణను నోచనా

కడలి గట్టున ఉడుతనైతే బుడత సాయము చేయనా
కాలమెల్లా రామభద్రుని వేలిగురుతులు మోయనా ॥రాయి॥

కాకినైనా కాకపోతిని ఘాతుకమ్మును చేయుచూ
గడ్డిపోచను శరముచేసి ఘనత రాముడు చూపగా
మహిని అల్పజీవులే యీ మహిమలన్నా నోచగా
మనిషినై జన్మించినానే మత్సరంబులు రేపగా
మద మత్సరమ్ములు రేపగా

పడవనైనా కాకపోతిని స్వామి కార్యము తీర్చగా
పాదుకైనా కాకపోతిని భక్తి రాజ్యమునేలగా ॥రాయి॥

★ ★ ★

# బొట్టు కాటుక-1979

శ్యాంప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్. సంగీతం చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల.**

అల్లీ బిల్లీ గారడీ – అల్లరి చూపుల చిన్నది
కమ్మని కౌగిలీ ఇమ్మన్నది
అల్లీ బిల్లీ గారడీ అల్లరి చూపుల టక్కరి
కళ్లల్లో వున్నదీ – కాదంబరీ.... ॥అల్లీ॥

వరాలు ఇచ్చే దేవతలాగ కనబడతావు
అందంచందం ఆరాధిస్తా ఆశలు తీర్చవె నువ్వు
నీ నవ్వే వెన్నెల పువ్వు....

ఇదిగో ఇవ్వమంటావు అబ్బా ఆగనంటావు
మురిపించే తొలిరేయి రావాలిగా
కమ్మని కౌగిలి ఇమ్మన్నదీ అహహ ॥అల్లీ॥

మగాడికున్న తహతహలన్నీ పడుచు పిల్లకివున్నా
ఉరకలు వేసే ఉబలాటానికి పగ్గం వేయ మంటుంది

శుభలేఖను రాయ మంటుంది

ఇపుడే లగ్నమంటాను – ఇదిగో తాళి కడతాను
తీరాలి ముచ్చట తీరాలి ॥అల్లీ॥

★ ★ ★

# బొమ్మరిల్లు-1979

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి బాలసుబ్రహ్మణ్యం**

చల్లని రామయ్యా చక్కటి సీతమ్మా
కొలువున్న లోగిలి కోవెలేనయ్యా – మా కోవెలేనయ్యా

శ్రీరాముడు అన్నయ్య సీతమ్మ మా వదిన
చెల్లి తోడ ముగ్గరయి శ్రీరాముని తమ్ములము
ఆంజనేయుడు వీడు నమ్మినబంటుగా వుంటాడు
జయ జయరామ జానకి రామ పావనరామ పట్టాభిరామ

అన్న మాటదాటని వాళ్లం అందిరికీ మేం ఆదర్శం
వదినమ్మ చెప్పిందేదో అదే మాకు వేదం
కలకల లాడుతు మే మిట్టాగే కలిసి మెలిసి వుంటాం
జయ జయరామ జానకి రామ రామరామ పట్టాభిరామ

## 2

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

కట్టుకున్న బట్టకుంది ఖరీదైన రేటు
కట్టుకోని పిల్లకుంది అంత కన్న పై రేటు
అంతా రేటు మయం - ఈ
లోకం రేటుకి దాసోహం

ఆడే ఆటకి రేటు - పాడే పాటకి రేటు
కన్నెపిల్ల సొగసుకి - కన్నుపడిన సొగసుకి
మధ్య నున్న సంబంధం - రేటు
మనిషి కావాలన్నా మనసు కావాలన్నా
కడకు చావాలన్నా దానికుంది రేటు - చ
వాట్ ఎ బ్లడ్డీ లైఫ్

కట్టే తాళికి రేటు - తిండికి రేటు
కొండమీద దేవుడిని కొలుచుకొనే భక్తుడికీ
మధ్య నున్న సంబంధం రేటు

స్నేహం చేద్దామన్నా - ద్రోహం చెయ్యాలన్నా
దాహం తీరాలన్నా - దానికుంది రేటు. చ

★ ★ ★

# జూదగాడు-1979

నమతా మూవీస్ సంగీతం : చక్రవర్తి

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

అల్లారు ముద్దుగా పెరిగింది మా లక్ష్మి
అత్తవారింటికే తరలింది
మాచెల్లి బంగారు తల్లి
మా అక్క చక్కని చుక్క పోయిరావమ్మ
పేరు తేవమ్మా - బంగారు తల్లీ

పూజ చేసి ఏరికోరి నిన్ను చేసుకుందీ
పువ్వుల్లో పెట్టుకో - చిరునవ్వుల్లో దాచుకో

మనసారా కాపురాన్ని మలచుకో
మాలక్ష్మికి అండగా మేమున్నాం తెలుసుకో

బావా - ఓ మా మంచి బావా
బావగారు మహాగడుసువారూ - మంచి చేసుకో

చిలిపి పనులు చేశాడో - ఆ చెవులు పుచ్చుకో
కట్టుకున్న వాడు కలకాలం నీ మదిలోనే వున్నా
తోడ బుట్టినాము మమ్ము క్షణకాలం తలుచుకో
చెల్లీ - బంగారు తల్లీ
అక్కా ఓ చక్కని చుక్కా.

★ ★ ★

# మావూళ్లో మహాశివుడు-1979

గీతా సినీ ఎంటర్ ప్రైజెస్. సంగీతం : సత్యం

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

స్వర్గం నరకం చేరే దెవరో చెప్పడమెందుకురా
నోచిన పుణ్యం చేసిన పాపం
స్వర్గమో నరకమొ తేల్చునురా ॥స్వ॥

పట్టు పరుపుపై పుట్టిన వాడు మట్టిలో కలియునురా
మట్టినేలపై పుట్టిన వాడు గిట్టక మానడురా

ఉన్నవాళ్లు కట్టిన మూటలు లెక్కకు రావురా
పోయేనాడూ నీ వాళ్లెవరో లెక్కకు వచ్చునురా ॥స్వ॥

పరుల మేలుకై బ్రతికే వాడే పరమ పావనుడురా
ఆ పుణ్య పురుషుడే కీర్తి శేషుడై తరలి వెళ్లుతుంటే
ఎంత మంది తమకంటి నీటితో తర్పణ చేస్తారో
అంతటి పుణ్యం ఆజీవునికి స్వర్గం యిచ్చునురా ॥స్వ॥

నలుగురి కడుపులు కొట్టేపాపికి ఈడ్చేదిక్కే వుండదురా
ఏడ్చే కన్నే మిగలదురా – నరక కూపమే ఖాయమురా
ఊరికి చివర ఉత్తరమందున – వుంది రుద్ర భూమి
మంచి మిగిల్చి కాటికి చేరిన మరణంకాదుసుమా
అదియే జీవన్ముక్తి సుమా ॥స్వ॥

★ ★ ★

# అందడు-ఆగడు-1979

సంగీతం సత్యం

**1**

**పాడినవారు: ఎస్. జానకి**

నీ కోడె వయసు - నా ఆడమనసు
లాగేస్తాంటే వూరిస్తాంటే ఏం చెప్పమంటావే
ఏం చేయమంటావు - నా మేనిపొంగు చేసింది హంగు
నీ మీద రంగాయెర చాటేలనీకు - మాటేలనాకు

మాటాడు కుందాముర
ఊ అంటే ఓ యంటురానా
ఔనంటే నీ జంట కానా
ఉబలాట ముంటె చెలగాట మాడు ||నీ||

పులిపిల్ల లాగు పొగరె నీకు పొంకం
పంజాను విప్పిందిరా

నా .కన్నె షోకుల కై జారులాగా
పదునెక్కి మెరిసిందిరా

వాటంగ వున్నాను నేను - వాటేసుకోవాలి మేను
వెంటాడి నన్ను వేటాడుకోరా

## 2

### పాడినవారు: పి. సుశీల బృందం

ఈ సంతలో ఒక చిన్నది – నిలుచున్నది
కొను వారెవ్వరో
విలువలు కట్టేది ఎవరో – నను
వెలయిచ్చి మెచ్చేది ఎవరో ॥ఈ॥

అమ్ముడు పోయే అంగడి బొమ్మ ఆశలతో ఆడేంది
వన్నెలు చూసి చిన్నెలు చూసి అందరికనులు చెదిరాయి

మనసును చూసేది ఎవరో నా
మమతలు దూసేది ఎవరో ॥ఈ॥

మంచి తనాన్ని చక్కదనాన్ని పంచులతో కొనలేరు
ఎవరికి ఎవరు ఏమౌతారో దేవునికే తెలిసేను

తెలియని కథ మారుతుందా
తీయని కల పండుతుందా ॥ఈ॥

★ ★ ★

# కొత్త అల్లుడు-1979

సంగీతం : చక్రవర్తి

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

రూపాయి – రూపాయి
నమోనమో శ్రీ రూపాయి – నమోస్తుతే
పాపం చెయ్యర – రూపాయుంటే – ఫరవాలేదురా
పుణ్యం చెయ్యర పైసాలేనిదే – బతుకే లేదురా
రొక్కంవుంటే కురూపికూడా – చుక్కల్లో చందురుడే
సోమ్ము ల్లేవా.
ధనమూల మదమ్ జగత్ – డబ్బుకులోకం దాసోహం ||రూ||

ఓట్లు కొంటుంది రూపాయి – సీట్లు తెస్తుంది రూపాయి
మంత్రం తంత్రం న్యాయం ధర్మం – మనీపర్సులో వుంటాయి

బూజును సహితం రూపాయి – రాజుని చేస్తుంది
రాజునుసైతం రూపాయి రాళ్లపాలు చేస్తుంది...

మనీ మేక్స మేనీ థింగ్స్ – మనీ మేక్స్ సోమెనీథింగ్స్
అమెరికన్ డాలర్ రష్యన్ రూబుల్ – పారిస్ ఫ్రాంకూ ఇటలీ వెరా

ఏ పేరైనా ఏ వూరైనా – ఆత్మ మాత్రం రూపాయి
పరమాత్మ రూపం రూపాయి
ఓం శివరూపాయి ఓం విష్ణురూపాయి – రూపాయే
నమో నమో శ్రీ రూపాయి
నమోస్తుతే – శ్రీ రూపాయి.

## 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

అదిగదిగో ఆనవ్వే – పకపక పకలాడే నీ నవ్వే
ఈ కుర్రోణ్ణి వెర్రోణ్ణి చేసింది – అచ్చంగా పిచ్చోణ్ణి చేసింది
ప్రేమ పిచ్చోణ్ణి చేసింది

అబ్బబ్బ అయ్యా బాబోయ్ – ఆ చూపే
చుర చురలాడే ఆ చురుకే–
ఈ కుర్రదాన్ని వెర్రి దాన్ని చేసింది – అచ్చంగా పిచ్చిదాన్ని చేసింది
ప్రేమ పిచ్చి దాన్ని చేసింది ॥అదిగదిగో॥

ఒక నవ్వు చిత్తు చిత్తుగా ఓడిస్తూంటే
ఒక నవ్వు మత్తు మత్తుగా కవ్విస్తుంటే
ముందు నవ్వు తరువాత నువ్వు – పువ్వుకే నవ్వు నేర్పిస్తుంటే
నీ నవ్వుకే పువ్వులు విర బూస్తాయి ॥అదిగదిగో॥

ఒక చూపు పొద్దుటెండలా చలి పెడుతుంటే
ఒక చూపు మల్లె చెండులా మనసవుతుంటే
నవ్వి చూడు చిరునవ్వు తోడు
పెదవీ పెదవీ కలిపేస్తూంటే – ప్రేమ సంతకం పెట్టేస్తుంటే

ఆ వాలు చూపులతో చేవ్రాలు చేస్తూంటే
నువ్వంటే నేనంటే నవ్వాలి
నవ్వు నవ్వు నవ్వు.

## 3

**పాడినవారు: పి. సుశీల**

దేవుడే వరమిచ్చాడు - కోరిన వరుడేవచ్చాడు
పెద్దలు తథాస్తు అన్నారు - మా ప్రేమను దీవించారు

అంతులేని అనురాగమే అందాల వేదికగా
అల్లుకున్న మమతల లతలే తోరణాలుగా
తొలివలపే ముత్యాలై తలంబ్రాలు పోయగా
వేదాలు సన్నాయి నాదాలు మారు మ్రోగగా
ఇద్దరికీ పెళ్లి జరిగేను - మా ముద్దూ ముచ్చట తీరేను ॥దే॥

శృంగార సాగరాన తీరాలు చూస్తాను
రాగాలు ఆనంద యోగాలు మేళవించగ
కలలను నిజమే చేస్తాను - కమ్మని కథ జీవిస్తాను.

## 4

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

పిల్ల కాదమ్మ పిడుగోయ్ పిడుగు
ఈ బాల బంగారు తొడుగోయ్ తొడుగు
ఆరుబయట కౌగిట్లో జారుపైట పందిట్లో
వేయేళ్ల వెన్నెల మడుగోయ్ మడుగు

పిల్లవాడు కాడమ్మో పిడుగోయ్ పిడుగు
మొనగాడోయమ్మ అడుగోయ్ అడుగు
మల్లెపూల ఎన్నెట్లో పిల్లగాలి సందట్లో
వేశాడు వెయ్యేళ్ల గొడుగోయ్ గొడుగు

మెరుపల్లె చూశాడె ఉరుమల్లె వచ్చేడె
జడివానలా వచ్చి తడిపేసినాడె

వలపల్లే వచ్చిందే వరదల్లే పొంగిందె
వరసున్న మనసల్లె కాటేసినాడె

ఈ జంట నావల రేవొక్కటే
మాకంటి చూపుల రేపొక్కటే

నా ఎదుటే ఎదిగాడె నా ఎదలో ఒదిగాడె
తననీడ నాపూల మేడన్న – తోడె

తనువంతా మనసైన – మనసంతా సొగసైనా
సన్నజాజి నవ్వుల విరపూసినాడే

ఈ జంట పూవులు ఏ తోటవో
ఈ మా జోడు పులకింత లేనాటివో

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

హరి హరి హరి హరి శ్రీ కృష్ణ హరి
సరి సరి సరి సరి నువ్వే నాకు సరి

రావే రావే ఉషా కన్యకా – రంభా వూర్వశీ మేనకా
అందరూ నీకు బలాదూర్ ॥హరి॥

పారాహుషార్ పారాహుషార్
రారా – రా ఉషా ప్రేమికా – నీవే నాలో నిషా కోరికా
అంద చందాల బహదూర్

పారా హుషార్ – పారా హుషార్
లీల లెన్ని ఉన్నా రాసలీల ఒకటే
గోల లెన్ని చేసినా – ప్రేమగోల ఒకటే

లీలా గోలా ఏలా బాలా – వెన్నెల మల్లెల మాలా
సబ్ కుచ్ జానే దేవ్ – ఈ రోజులు పోతే రానేరావ్
తుఫాన్ – కమాన్

★ ★ ★

# దేవుడిచ్చిన కొడుకు-1979

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

అయితే మొగుణ్ని కాదా మగాణ్ని
కానీ వలపు బోణీ - అయితే ఎల్లుండి లేదా ఏకాశి
అవుతా ఇంటి వాణ్ని - ఇస్తా చంటి వాణ్ని ||అయి||

అయితే పెళ్లాన్ని కాదా కళ్లాన్ని
కాదోయ్ వలపు బోణీ అయితే ఎల్లుండి లేదా ఏకాశి
అవుతా యింటి దాన్ని చేస్తా మోజువాణీ

కంటి కో గురివుంది చూసుకో
కండలో పురి వుంది కాసుకో
కొండంత సిరివుంది - కోరే మగసిరి వుంది
ఏలుకో ఎన్నెట్లో - వాలిపో కౌగిట్లో సోలిపో సోలిపో

అయితే గియితే నా మొగుడైతే - అప్పుడు చూద్దాంలే
మల్లెల పొదలో వెన్నెల ఎదలో చప్పుడు చేదాంలే

దోవలో నక్కుంది కాసుకో - తొక్కితే లక్కుంది చూసుకో
అందాక ఆగిపో అందేక రేగిపో - అందుకో అందుకో అందుకో

అయితే గియితే పెళ్లామయితే నారాణీ రావే
అద్దాన్నిస్తే... ఓ ఛాన్సిస్తే - అడ్డాలె లేవే.

★ ★ ★

# ఇంటింటి రామాయణం-1980

నవతా ఆర్ట్స్ సంగీతం : రాజన్ నాగేంద్ర

**1**

**పాడినవారు: పి. సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

ఇంటింటి రామాయణం – వింతైన ప్రేమాయణం
కలిసుంటే సలాపము – విడిపోతే కల్లోలము
సితమ్మ చిలకమ్మ – రామయ్య గోరింక
ముచ్చట వలపుల సరాగం ||ఇంటి||

నీవుంటే నందనవనము – లేకుంటే అశోక వనము
నీవాడే వూసులన్నీ రతనాల రాసులే

నీ వుంటే – పూలబాట – లేకుంటే రాలబాట
నీతోటి ఆటలన్నీ సరసాల పాటలు
ముత్యాల మాటలు ||ఇంటి||

సరిగంచు చీరలు తెస్తా కవరింగు సరుకులు పెడతా
తెమ్మంటె మాయలేడి తేలేనే నిన్నాదరి

మబ్బుల్లో నీళ్లు చూసి – ముంత ఒలక బోసుకోను
కేసులాడుకున్నా సుంమత రోసమొచ్చి పోకురా
కలిసి మెలిసి ఉండరా ||ఇంటి||

ఇల్లేకదా స్వర్గ సీమ
ఇద్దరిదీ చెరగని ప్రేమ

కలతలేని కాపురాన కలలన్నీ పండాలి
మోజున్న ఆలుమగలు
కులకాలి రేయి పగలు

మన ఇద్దరి పొందిక చూసి – ఈలోకం మెచ్చాలి
దీవెనలే ఇవ్వాలి. ||ఇంటి||

# సంఘం చెక్కిన శిల్పాలు-1980

శ్రీ విజయకృష్ణా మూవీస్ సంగీతం : రమేష్ నాయుడు

**పాడినవారు: పి. సుశీల**

మా పాప మాణిక్యమే - రూపమో వైడూర్యమే
ముద్దుల పాపకు దిద్దిన తిలకం
ముచ్చటైన ముద్ద మందారమే

గలగలా వురికిందంటే - మా పాప బంగారు గిలక
కలకలా నవ్విందంటే మా పాప పంచదార చిలక
కోరితే జాబిల్లి కొండ దిగి వస్తుంది
పాపాయిని లాలించి పాల బువ్వ పెడుతుంది

పువ్వులే ముడిచిందంటే - మీ పాప పూర్ణ చంద్రబింబమే
గాజులే తొడిగిందంటే - మా పాప గాజులకే అందమే
పట్టు చీరకడితే చిట్టి ముత్తయిదువే
అన్నీ సింగారిస్తే - ఆదిలక్ష్మి చెల్లెలే.

## 2

### పాడినవారు:. పి. సుశీల బృందం

పోయిరావే అమ్మ పోయి రావమ్మ
అత్తవారింటికి అపరంజి బొమ్మ

ఏ కన్నె పడుచైన ఇప్పుడైనా ఎప్పుడైనా
అత్తింటి కేగక తప్పదని తెలిసి
విలపించు టెందుకో యీ పిచ్చితల్లి
వెళ్ళిరా చల్లగా నా చిట్టి తల్లీ.

రావమ్మ రావమ్మ · రతనాల బొమ్మ
అత్త మామల మెప్పు అందుకో వమ్మ

వైకుంఠపురి నుండి వచ్చెనో మహాలక్ష్మి
వెండి కొండను దాటి విచ్చేసెనో గౌరి
ఆ పుట్టినింటికీ – యీ మెట్టినింటికీ
వన్నె వాసిని తెచ్చి – వర్ధిల్లవోయమ్మ

## 3

### పాడినవారు: ఎస్. జానకి

ఓ రక్క మొగుడ మామయ్య ఓ రత్త మొగుండా మామయ్య
చెప్పాలంటే సిగ్గయ్య చెప్పక తప్పదు ఓరయ్య

అందం చందం లేని మొగుడు నాకూ వున్నాడు
నానాగడ్డీ తింటాడు మాటల్లో నే మొనగాడు

ముక్కు మూతీ చూశావంటే నల్ల కోతిలా వుంటాడు
సెంటు బుడ్డి తెస్తాడు. ఒంటి నిండా పూస్తాడు

చేతులకెట్టి చెవులకు పెట్టి
మెడకు కట్టి నడుముకు కట్టి
కాళ్లు పడతాడు – నా కాళ్లు పడతాడు

కడియాలేస్తాడు వేసి చూస్తూ వుంటాడు
నాకేసి చూస్తాడు వెర్రి నవ్వు నవ్వుతాడు

బుగ్గమీద గిల్లగానె బూరల్లె పొంగుతాడు

మొగలి రేకు చేతికిస్తే ముడిచి పెట్టుకుంటాడు
చూసి చూసి చెక్కేస్తా పాసింజరెక్కేస్తా

# మనవూరి పాండవులు-1980

సంగీతం : కె.వి. మహదేవన్

**1**

**పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం**

సిత్రాలు సేయిరో శివుడా
శివమెత్తి పాడరో నరుడో నరుడా
నువ్వు సిందేసి ఆడరోయ్ నరుడా నరుడా

అండపిండ చిమ్మాండ మంతా ఆ శివుడే శివుడే
అందులోన నలిగేది అయ్యో ఆ నరుడే నరుడే ||సి||

ఏపకాయి కన్న విసం – ఎర్రి పుచ్చకాయిరా
పాడు బుద్ది దొరగారు – పాము కన్న ఇసమురా

నమ్మించే దగాకోరు నాబికన్న ఇసమురా
ఇన్ని ఇసాలే దిగమింగే – ఎర్రోడే గొప్పరా ||సి||

కాని పనులు సేసినోడూ భూమినేలు తున్నాడూ
మంచి బుద్ధులున్నాళ్లో మట్టి కురుస్తున్నాడూ

నిన్నే బుకాయించి నోణ్ని – సీమైనా కుట్టదేం శివుడా
మతిపోయిన పిచ్చితల్లి మాకెవరికి పట్టదేం
అదే సిత్రం. ||సి||

## 2

పాడినవారు: ఎస్.పి బాలసుబ్రహ్మణ్యం

ఒరే, ఒరే పిచ్చి సన్నాసి
ఒరే పిరికి సన్నాసీ
ఇలా చూడు ఇలా చూడు ఇటుకేసి
ఉన్న ఊరు కన్నతల్లి ఒరే ఒరే. మరవకురా
నమ్ముకున్న సొంత వూరు - వెన్నులోన పొడవకురా
మొఖంమీద కోపంతో ముక్కు కోసుకుంటారా
ఏలు మీద కురుపుందని - కాలు కోసుకుంటారా

ఆవేశం నీ తెలివిని చంపుతుందిరా
ఆలోచన నీ బలాన్ని పెంచుతుందిరా

ఈ నీరూ ఈ గాలీ - ఈ నేలా నీదిరా
ఊరిలోన ప్రతి ఒకరూ నీ చుట్టం నేస్తంరా
ఆశ పెట్టుకున్నోళ్లను అన్యాయం చెయ్యకురా
అన్నాయం చేసి నోడి ఆటలు కట్టించరా

మమత తెంచుకున్నవోడు మనిషి కాదురా
మనిషైతే దేనికైన దడిసి పోదురా

ఐదు వేళ్లు కలిసుంటే చేతిదెబ్బ గట్టిదిరా
పిడికిలి బిగియించరా
పిడుగులు కురిపించరా.

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఆనంద్, రామారావు

పాండవులు పాండవులు తుమ్మెదా
మనవ్వూరి పాండవులు తుమ్మెదా

బలమున్న వొణ్ణినీ మదమెక్కి నోడికి
పాఠాలు చెప్తారె తుమ్మెదా

ఆణ్ణి పాతిపెట్టేస్తారె తుమ్మెదా ॥పాం॥

చచ్చుపీనుగ వాడు బతికున్న వోళ్లను
చంపుతున్నాడె తుమ్మెదా
చావ చంపుతున్నాడే తుమ్మెదా
శకుని మామే వీడు శకున పక్షిగాడు
మోసెయ్ మోసెయ్ తుమ్మెదా
కనక్సను తీసెయ్ తీసెయ్ – తుమ్మెదా ॥పాం॥

బక్క చిక్కిన వాడు ఒక్కడె అయితే
పగతీర్చు కోలేడు తుమ్మెదా అయ్యో
కాలు నిలదొక్కు కోలేడు తుమ్మెదా
అన్నదమ్ముల్లాగ అయిదుగురొకటైతె
టాపు లేపేస్తారె తుమ్మెదా
వీపు సాపు చేసేస్తారె తుమ్మెదా
సరిగమ పదనిస తుమ్మెదా
మపదాప మారిస తుమ్మెదా ॥పాం॥

జమ్మి చెట్టుమీద దాచిన బాణాలు
నెమ్మదిగా తెచ్చారె తుమ్మెదా
అతి నెమ్మదిగ తెచ్చారె తుమ్మెదా
రిమ్మ రేగిన దొరను గుమ్మాన నిలబెట్టి
కుమ్మి పారేస్తారె తుమ్మెదా
వాణ్ణి దుమ్ము దులిపేస్తారె తుమ్మెదా.

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

ఎండలో ప్రజలంతా ఎండిపోతున్నారు
పండు వెన్నెల్లో దొర పండుకున్నాడేమో
రక్తాలు కుతురా రమణి రంగసాని
దయ చేయమని చెప్పవే దొరగోరిని
దయచేయమని చెప్పవే.

## 5

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

మంచికి చెడ్డకి పోరాటం
మళ్లా ఇదిగో ఆరంభం
దుండగీడు ఆ హిరణ్యకశిపుని
చెండాడునురా నరసింగం
చీల్చిచెండాడునురా నరసింగం

అరణ్యవాసం చేసే వాళ్లు తిరిగి యింటికి వస్తారు
అప్పుడు రాజా శకునీ గికునీ – తుడిచి పెట్టుకుపోతారు
గడ్డిపరకలు అయిదే అయినా – గట్టిగ పేనితె మోకురా
మోకుతాడుతో కట్టిపడేస్తే – మొనగాడైనా బందీరా

గుప్పిటిలోన ఎన్నాళ్లు – నిప్పును నువ్వు మూస్తావు
బోనులోనికి ఎన్నాళ్లు పులులను నువ్వు తోస్తావు

ఘీంకరించెరా గున్న ఏనుగా
జూలు దులిపెరా పోతుసింగమూ

పంజా విప్పిపైన బండిందో – పటాపంచలై పోతారు ॥మంచికి॥

కారు మబ్బులే మూయవా – కుండ పోతగా కురవదా
కూకటి వేళ్లు కదలినా కుచ్చిత మంతా వదలదా

నరుడే కదిలి నటరాజై – నాట్యం చేసే ఆ రోజు
మూడో కన్ను తెరిచాడంటే
బూడిద పాలై పోతారు.

పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, రామారావు, ఆనంద్

జండాపై కపిరాజురా – గండర గండ లేవరా
చేతిలో ఉన్నది గదరా – చెకచెక చెక పదరా

ధర్మన్న శాంతం అంటాడు – శాంతం – శాంతం – శాంతం
భీమ్మన్న తంతాం అంటాడు – తంతాం తంతాం తంతాం
గాండీవి పంతం అంటాడు – పంతం పంతం – పంతం
కవలలూ రగతం చూస్తారు – రగతం – రగతం – రగతం

భళానోయి తమ్ముడా – లడాయి మొదలాయె తమ్ముడా
చెంప ఛడేలనిపించు తమ్ముడా

అయిదుగురికి అయిదూళ్లక్కర లేదూ
ఉన్న ఊరు చల్లగుంటే చాలు

తొడగొట్టి అనాడు అణ్ణే – పడగొట్టుతాను ఈనాడు
పాశుపతమున్నది చూడు – అణ్ణే – పీసుపీసు చేస్తా నేడూ

అన్న మాటకు సైం అంటాం
ఝూంఝుంటు చేయెత్తి జై అంటాం
జై కృష్ణా – జై జై కృష్ణా.

## 7

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

పిరికి మందు తాగి వూరు నిదరోయింది
గురకపెడుతూ మావాడ నిదరోయింది
పిచ్చిగాలి నువ్వు అరవకే
వెర్రినేలా గోడు పెట్టకే ఊరుకో, ఊరుకో ॥పిరికి॥

కండగల మంచోళ్లు కాలిపోతే పోనీ
గాలిలో తమ్ముళ్లు కలిసి పోతే పోనీ
కన్నీరుగా ఏరు పారకే
నీ హోరుతో మమ్మల్ని లేపకే

మన్ను విరిగి కిందపడనీ మాకేం
మన్ను కుతకుతలాడి పోనీ మాకేం
సూరీడు ఇక నువ్వు పొడవకు
సోదించి మా గుండె తడవకు
తడవకూ – తడవకూ

★ ★ ★

# కక్ష-1980

సురేష్ ప్రొడక్షన్స్ సంగీతం : చక్రవర్తి

పాడినవారు: పి. సుశీల, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, రమేష్,
చక్రవర్తి, ఆనంద్, శైలజ

ఓ రబ్బ వూరూర సవాలు చేస్తున్నాం
సమ ఉజ్జీ ఎవరంటూ సభలో చూస్తున్నాం

మాటకు మాటుంది వేటుకు వేటుంది
పోటీకొస్తే పీటీ చేసి బోల్తా కొట్టేస్తాం

ఓ రబ్బ మాదిబ్బ అగ్గిబరాటా
ఒక్కసారి రుచి చూడు ఉక్కుకరాటే రా

మాటకు మాటుంది వేటుకు వేటుంది
పోటీ కొచ్చి పీటీ చేసి చీటీ చింపేస్తాం ॥ఓ రబ్బ॥

మీ తాతకు దగ్గులు నేర్పిన వాణ్ణి
నన్నా ఎదిరిస్తావ్
మీ తాతల ముక్కులు పిండినవాడిని
నీకా జడిసేదీ
బురద గుంటలో చేపలు పడతావ్
తిమింగలాన్ని మింగేవా
తిమింగలాన్ని గిలగిల కొట్టి తిక్కా తిమురు ఒదిలిస్తా ॥ఓ రబ్బ॥

హీరోలైతే దాగా లెందుకు - చీర కొంగు వెనుక - నా
చీర గొంకు వెనుక
సత్యభామ కథ చదవ లేదులే చవటా పోపోవే

సత్యభామవో చుప్పనాతివో చప్పూన తేల్చేస్తా
ముక్కు చెవులు దక్కవు నీకు టక్కున చెక్కేస్తా
కయ్యంలోనా కాలు దువ్వితే కుయ్యో అనిపిస్తా ॥ఓ రబ్బ॥

టెక్కు టెంపరు చూపేవా చుక్కలు కనబడతాయి
గుడ్లూచ్చి వెక్కిరించితే – నడ్డి విరుగుతుంది

గుట్టూ మట్టూ బయట పెట్టితే – ఆటకట్టుతుంది
మీ ఆట కట్టుతుంది

తెరవెనుక భాగోతం చూస్తావా
చూడు చూడు – చూడు ॥ఓ రబ్బ॥

★ ★ ★

# రామ్ రాబర్ట్ రహీమ్-1980

పద్మావతీ ఫిలిమ్స్ సంగీతం : చక్రవర్తి

పాడినవారు: మాధవ పెద్ది, రమేష్

మై నేమ్ ఈజ్ రాబర్ట్ గొంజాలిజ్
ఐ కమ్ ఫ్రమ్ లాలీ పేరడైజ్
ఎవరేనా అమ్మాయ్ మా ఇంటికి రావాలంటే
వలపుల పేట షోకుల వీధి
డోర్ నెంబర్ 420 చార్ సౌ బీస్. దట్ ఈజ్ మై ఎడ్రెస్.

ముద్దొచ్చే అందాలు
మురిపించే మోహాలు
ఇద్దరిలో ఉన్నాయి ఈ రోజే కలిశాయి

నన్నే నన్నే చూడు – కుదిరే ఈడు జోడూ
నాతో కలిసి ఆడు – నా గుండెల్లో బాజాలు మోగి
వన్నెలు చూసి తిన్నగ వచ్చెయ్
డోర్ నెంబర్ 420 చార్ సౌ బీస్
ఎక్స్‌క్యూజ్ మీ ప్లీజ్

ప్రేమిస్తే వస్తాయి ఎన్నెన్నో కష్టాలు
నిజమైన ప్రేమైతే – పండేను స్వప్నాలు

ఉందా ఉందా వలపు – మనసూ మనసూ కలుపు
మనదే మనదే గెలుపు
నాకళ్లల్లో కాపురముంటావా – నీది నాది ఒకటే ఇల్లు
డోర్ నెంబర్ 420 చార్ సౌ బీస్
ఎక్స్‌క్యూజ్ మీ ప్లీజ్.

# రాజాధిరాజు-1980

రామచిత్ర　　　　　　　　　　　　　　సంగీతం : కె.వి మహదేవన్

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

తాగు భాయి తాగు చాంగుభళా చాంగు
సంతోషం చేసుకుంటూ సరదాలు పంచుకుంటూ
పాడు భాయి పాడు – తాగుభాయీ తాగు–　　　　॥తాగు॥

పడుచుపిల్ల పక్కనుంటే అదోసుఖం
అది పదం పాడుతూవుంటే అదో సుఖం

వెచ్చని చుక్కేస్తే నచ్చినట్టి పనిచేస్తే
వెర్రి సుఖం వెర్రి సుఖం.　　　　॥తాగు॥

రేపుమనది కాదూ నేడు పోతె రాదూ
అనుభవించు నేడే అన్ని సుఖాలూ

మొగమాటంవద్దూ మోజుకేంటి హద్దు
మురిపించే పిల్లతో ముచ్చటలాడు　　　　॥తాగు॥

కోయనట్టి పండెపుడూ తీయ గుండదు
మిటకరించి చూస్తూ గుటక లేయకు

ఉన్నోళ్ల సొమ్మంతా లాక్కోరా లాక్కోరా
లేనోళ్లతో అది పంచుకోరా పంచుకోరా　　　　॥తాగు॥

## 2

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

అల్లి బిల్లి అమ్మాయి – అంద చందాలున్నాయి
ఉన్నవి మెచ్చాను – వచ్చాను లే
నాజూకులు దాచేసినా నే దోచుకోనా ||అల్లి||

లలనా తగనా వలలో పడనా

నీ హంసల నడకల అడుగుల వెంబడి
చిలకల పలుకుల కిలకిల వింటూ
గిర గిర గిర గిర చుట్టూ తిరిగే
మొన్న నిన్ను చూశాను – నిన్న కన్ను వేశాను
నేడు దారికాశానూ రేపు చూసుకో ||అల్లి||

మండిపోతోంది నా తాపమే
ఎండి పోతోంది నా గొంతుకే

ఈ దాహము నీ మోహమే – తీర్చాలిలే – రావే ||అల్లి||

ఉడుము పట్టు నా పట్టు – ఊడగొడతా నీ బెట్టు
నాకు తెలుసును నీగుట్టు – ఊ కొట్టవే ||అల్లి||

మిడిసిపడకే – ఒడిసిపడతా
నీ ముందర కాళ్లకి బంధం వేస్తా

ముక్కుకు తాడు ఠక్కున వేస్తా
ఎక్కడి కెడితే అక్కడి కొస్తా

కల్ల బొల్లి కోపాలు కస్సు బుస్సు అనబోకే
చిర్రు బుర్రు మంటున్నా సింగారివే
నాజూకులు దాచేసినా – నే దోచగారానా.... ||అల్లి||

★ ★ ★

# ఓ ఇంటి భాగోతం-1980

నవతా ఆర్ట్స్ సంగీతం : జి.కె. వెంకటేష్

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

నవ్వే ఒక పువ్వు నను చూసి నవ్వింది – తొలినవ్వు
ఆ నవ్వులో నా గుండెలే జారి పోయాయిలే
తొలిసారి నోరార తిట్టింది. మలిసారి చెయ్యెత్తి కొట్టింది
మనస్సుమారి నా తపస్సుపండి – ప్రేమకే పట్టం కట్టింది

అనుకోని అందాలు దొరికాయి ఆనందనాట్యాలు చేసాయి
నరాలలోన కరెంటుపాకి పగలే చుక్కలు వెలిగాయి.

**2**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

సరిగా పాట పాడు. జతగా పాడి చూడు
నాదం లయలో శృతిలో మదిలో నిలపాలి

మధురం మధురం మానస సంగీతమ్ స్వరములు ఏడే అయినా
అగణిత రాగాలైనా – ఆనంద గీతావళీ

పిలిచినా రాదటే రాధికా విరిసిన శారదయామిని వేళా
కోయిల మలయ సమీరము వీచెను –
ప్రేమ నికుంజము మనకై వేచెను
పిలిచినా రావటే – రాధికా

## 3

**పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల.**

అందాలు ఆనందాలు మందార మకరందాలు
ఈ రోజు మనమోజులే విచ్చల విడిగా వెచ్చని వలపు
ముచ్చట చేసే సై ఆట

అనురాగం పందిరి వేసే సందిడిలోన
అందినవి తొందరగా దోచేసుకో
సింగారం చిందులు వేసే పందెంలో
నీ ఆశ ఆశ పెనవేసుకో

పువ్వుల పానుపు నవ్వులు పరవాలి – కలవాలి కలకాలం
విచ్చలవిడిగా వెచ్చని వలలా ముచ్చట చేసే సై ఆట

పరువాల జాతర చేసే పండుగలో
సరదాలు సరసాలు కలబోసుకో

పన్నీటి జల్లులు కురిసే సమయంలో
సరిగంగ స్నానాలు చేయించుకో

గువ్వల జంటల్లే కువకువలాడాలి – వదలొద్దు బిగి కౌగిలి
విచ్చల విడిగా వెచ్చని వలపు ముచ్చట చేసే సై ఆట.

## 4

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

వేస్కో గుటక. జిలిబిలి నిషాల చిటక ఉహూ అంటే
ఒరే ఇంకేల పుటక...... మైకమే కమ్మితే

సై సై సౌఖ్యమే చిమ్మదా – ఊగరా తోగరా
జిన్ను బ్రాంది రమ్ము విస్కీ ఓరో నీరో
ఏదో ఒకటి తాగరా సోగరా – వేస్కో గుటక

జిలిబిలి నిషాల చిటక – పెళ్లాం కళ్ళెం
మెళ్లో వేస్తుంది! పటకా కంకం కంమ్మని – వేళలో
సంసం సంబరం చేయరా
నంచుకో పంచుకో
బజ్జీ చిప్సు కోడిపకోడీ కక్కా ముక్కా
ఏదో ఒకటి నంచుకో – సోగరా – వేస్కో గుటక
జిలి బిలి నిషాల చిటక – మత్తూ చిత్తూ
గురుడే కట్టేశాడు జటకా – అహాఁ
గురుడే ఎక్కేశాడు అటక
హా హా హా మనమే గెలిచేశాం

## 5

**పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎస్. పి. శైలజ**

ఇల్లు ఇల్లని యేవు – ఇల్లు నాదని యేవు
ఇది యింటి భాగోతమే చిలకా
ఓ ఇంటి భాగోతమే చిలకా.

చుట్టాల గుండెల్లో పక్కాల మనసుల్లో
నీ ఇల్లు కట్టుకో చిలకా ||ఇల్లు||

మూటగట్టిన ముల్లె మోసగించక పోదు
కూడ బెట్టిన డబ్బు తోడురానేరాదు

పాతి పెట్టిన సొమ్ము పై కెగిరి పోతుంది
గురువు చెప్పిన మాట గురుతుంచుకోరా

భోషాణం పెట్టి నిను పాషాణంగా మారిస్తే
ఆషా మాషీ మనుషులు నిన్ను తాషామార్బా వాయిస్తే
చెయ్యరాని నీ చేతనీతే చెయ్యి విరగ గొడుతాయి
వడ్డీలకు వడ్డీ పెంచిన నీ నడ్డి విరగ గొడతాయి

సాటివారితో చక్కగవుంటే – కాటికైన వాళ్లొస్తారు
ఇప్పుడు నాలుగు గింజలు పెడితే – అప్పుడు గుప్పెడు పోస్తారు

అంతరాత్మలో ఎంతవాడికి తగదు అహంకారం
సంతతమ్ము సద్గురుని నామమే
చింత నామృతం శ్రీకారం –
వేసిన మంత్రం నీతో ఉంటుంది
చేసిన పాపం చెబితే పోతుంది.

★ ★ ★

# బంగారు లక్ష్మి-1980

దేవర్ ఫిలింస్ సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

కురిసే చిరుజల్లులో మురిసే యీ జంటకూ
ఎదలో ఆనందమూ - ఎంతో ఏకాంతమూ

కురిసే చిరు జల్లులో మురిసే యీజంటకూ
ఎదలో ఆనందమూ - ఎంతో ఏకాంతమూ

కలుసుకున్న తరుణములోన - వలపు కన్న కలిమే లేదు
కరిగిపోయే కౌగిలికన్నా కోరదగిన వరమేలేదు

కన్నుల గిన్నెల వెన్నెల నింపి
పెదవుల మధువుల మధురిమ లోంపి
కిలకిల కేరింతలే ఎంతో సంతోషమే
ఎంతో సంతోషమే - ॥కు॥

మసకమసక చీకటిలోన మమత కన్న వెలుతురులేదు
హోయి గాలిపే గుసగుసకన్నా తీయనైన గానము లేదు

నవ్వుల పువ్వుల పుప్పొడి రేగి
చల్లని చల్లని సవ్వడి సాగి
చెరిగే అనురాగమే - చెరగని వైభోగమే
చెరగని వైభోగమే ॥కు॥

## 2

**పాడినవారు: పి. సుశీల**

పుచ్చుకున్నది వెచ్చగున్నది - సచ్చినోడా - హాహా
మనసు పిచ్చిగున్నది.

పుచ్చ పూవులాంటి వెన్నెల విచ్చుకున్నది
ఇచ్చుకున్న వలపేమో గుచ్చుకున్నది

తెచ్చుకున్న ఆవేశం తేలిపోతదా
ముచ్చటైన మన సరసం మొదటి కొస్తదా ||పు||

హో హో హో నమ్మలేని కైపేదో కమ్ముకున్నది
నా నిండు గుండె నిన్నేమో నమ్ముకున్నది

వచ్చి చేరవన్నె చూసి మెచ్చనంటావా
వలపు బిచ్చమడిగినా ఇవ్వనంటావా ||పు||

★ ★ ★

# శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ మహాత్మ్యం-1980

మణి ఎంటర్‌ప్రయిజెస్.                సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

**1**

**పాడినవారు: పి. సుశీల**

బళె బళె బళె హాయి
వల్లె అని అల్లుకునే పిల్ల
నన్ను చూడ వెందువల్ల

కనుసన్నల పలు వన్నెల నా చిన్నెలు నెలకొన్నవిరా
ఆశించి నేను వచ్చానురా అందాలే కానుక లిచ్చానురా
నిన్నాశించే – నేను వచ్చానురా – అందాలే కానుక లిచ్చానురా

నీడవలె నీతో వుంటానురా
ఎన్నెన్నో నిగనిగలు వున్నాయిరా
హాయ్ – హాయ్ – హాయ్

నాగువలె కోడె నాగువలె
నా కన్నె వయసు దూకిందిరా
బాలననీ ఏలుకోనీ – బెలననీ జాలిగొనీ
గారవించరా నను గారవించరా ॥వల్లె అని॥

నెమ్మేను నీకై విర బూచెరా
కెమ్మోవి పై మధువు చిందేనురా

కొనగోట చెక్కిలి మీటాలిరా – హాయ్
కొనగోట చెక్కిలి మీటాలిరా – హాయ్

వాడని ఎన్నడు వీడనిది వలపే జోడించెరా
లేదనకా కాదనకా
లాహిరిలో మోహమునే తీర్చగలనురా
తమి తీర్చగలనురా హోయ్.... ||వల్లె అని||

**2**

**పాడినవారు: వాణీ జయరాం**

నీకేది కావాలిరా నెరజాణ రాయా – సరసాల రేడా
నీవు వెదికేది నాలో లోలో లేనే లేదా

ఎలమావి చిగురాకు మెసవిన కోయిల
అలరించు పంచమ స్వరమున్నది
కరి మబ్బు ఉరుముల తనిసిన మగనెమలి
పురి విప్పి పలికే షడ్జ స్వరమున్నది
రాయంచ నడకున్నది – వలరాచిలుక పలుకున్నది
రహి మించగా శృతి చేసినా స్వరమండలి ఈ సుందరి

మిన్నేటి కెరటాల పూచిన కమలాల
సరిసాటి నయనాల యుగమున్నది

మందార మకరంద మాధుర్యముల మించు
పగడాల అధరాల మధువున్నది

దరహాస మందు జిగి వున్నది
పరువాలలోన బిగి వున్నది
నీ కోసమే నెత్తావుల – కురిపించు. నీ – నీలాంబరి

★ ★ ★

# శక్తి-1980

సంగీతం : చక్రవర్తి

## 1

**పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

ఇట్టాగే ఇట్టాగే నిను చూడాలని వుంది
ఏదేదో ఇంకేదో అహఁ చెప్పాలని వుంది

పెదవి పెదవి నిన్ను నన్ను కలిపేస్తున్నా
వయసో వలపో నువ్వయి నేనయి కవ్విస్తున్నాయి

అట్టాగే అట్టాగే దరి చేరాలని వుంది
ఏదేదో యింకేదో - మరి కావాలని వుంది

పగలే రేయై ఈడూ జోడూ పెనవేస్తున్నది
జతగా బతికే - బ్రతుకే నువ్వయి ప్రేమిస్తున్నాది

ఉలిక్కి పడకు - అందంకాస్త కొలిక్కి పోతుంది
చిలక్కి చెప్పి చెక్కిలి కాస్త కొరుక్కు పోతుంది

ఉలిక్కి పడ్డ పిల్లది నిన్నే అతుక్కు పోతుంది
ఇద్దరి ముద్దు చూసినలోకం - ఉడుక్కుపోతుంది

బిగి బిగి కౌగిళ్లలో రగిలే కవ్వింతలో
మల్లెల ముగ్గు గాజులసిగ్గు అల్లుకు పోతుంటే ||ఇట్టా||

అడక్కపోతే అమ్మ అయినా అన్నం పెట్టదులే
అడుగడుక్కి గుమ్మయినా సరె గుమ్మం దాటదులే

చురుక్కు మంటూ చూసే నిన్ను చుట్టుకుపోతదిలే
ఎరక్కపోయి ఏదో నాడూ కట్టుకు పోతదిలే

చలి చలి వడగళ్లతో - తడిచే తుళ్లింతలో
కంటికి కన్ను కాటుక జున్ను అతుక్కుపోతుంటే - ||ఇట్టా||

2

పాడినవారు: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

సీతారాములు శివపార్వతులు రాధ కృష్ణులు ఒక జంట
బొట్టుకాటుక పువ్వులు గాజులు పసుపు కుంకుమలు ఒక జంట
ఆ జంటలే ఇక దీవించనీ ||సీ||

నేనొక కోవెల కట్టుకుని నిన్నొక దైవము చేసుకొని
తొలకరి హారతులెన్నో ప్రేమగ నీకే ఇచ్చుకొని

నన్నొక కౌగిలి చేసుకొని నిన్నే కాపుర ముంచుకొని
తొలి తొలి మమతల మామిడులే తోరణములుగా చేసుకొని

జగమే మరచి బ్రతుకే వలచి
ఒదగి ఒకటిగా ఒదిగే వేళ ||సీ||

నేనొక పిల్లన గ్రోవినని నీవే చల్లని ప్రాణమని
నా జీవన బృందావనిలో సుర పొన్నల నీడను చేరుకొని
నేనొక వేసవి గాలినని నీ మరుమల్లెల తావినని
అలిగిన మువ్వల అలికిడికే నా అష్టపదులు పాడుకొనీ

తెలిసి తెలిసి జతగా కలిసి
శృతి చేసే మమతల వేళ ||సీ||

## 3

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

మొగ్గలాంటి పిల్లదాని బుగ్గ గిల్లితే
పువ్వులాగ రేకు విప్పి పులకరించితే
తేనెలూరితే తీపిరేగితే పిచ్చిలాంటి ప్రేమపుట్టి రెచ్చిపోతే
అరె. డింగు డాంగు డింగు డాంగు డింగు డాంగు.

కొంటె చూపు పిల్లగాడు కౌగిలాగితే
కుర్రదాని అందమంత పొంగి పొర్లితే
తేనెలూరితే – తీపిరేగితే పిచ్చిలాంటి ప్రేమ పుట్టి రెచ్చిపోతే
డింగు డాంగు డింగు డాంగు డింగు డాంగు

పాలుగారు బుగ్గ చూసి పాపనైతే
దొండ పండు రంగు చూసి చిలకనైతే
గుండెమీద వాలిపోయి గువ్వనైతే
గండు తుమ్మెదల్లె వస్తె పువ్వునైతే
తుళ్లిపడే కళ్లు చూసి గాలమైతే – పెళ్లియీడు
పొంగు చూసి మేళమైతే – మెరిసే మెడవు నీవైతే
మెడకోరే ముడివైతే – ముడివేసే కొంగైతే

పైటనింత నమ్ముకుంటె పరువు తీసెనే
గుట్టు గున్న వంపులన్ని రట్టు చేసెనే
గొల్లుమని కుర్ర తనం గొలచేసెనే
అల్లరికి ఆడతనం అల్లాడెనే

ఒంటి నిండ సిగ్గుపాకి ఒణుకు పుట్టెనే
కొంటె కొంటె చూపులన్ని గోరువెచ్చనే
తడిసి తడిసి ముద్దయితే
ఎదనిండా ఎండుంటే – ఒడిచేరి ఆరేస్తే
డింగు డాంగు డింగు డాంగు డింగు డాంగు...

★ ★ ★

# ఊరికి మొనగాడు-1981

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం.**

కదలిరండి మనుషులైతే – కదలి రండి
మమతుంటే – ఉప్పెనగా ఉమ్మడిగా
బలి కోరిన దీనుల కోసం
బతకలేని చావలేని ప్రాణులకోసం ॥క॥

చెలియలి కట్టలు తెంచి చెలిమిని మరచి కడలి అనే
కాలనాగు కాటేసింది తాడి ఎత్తు తరగలు తన పడగలుగా
మమతల మాగాణియే మసి అయిపోగా
తెలుగు తల్లి విలపించెను – భోరుభోరున
పొంగే కన్నీరే కృష్ణా గోదారిలా ॥క॥

అమ్మా అని అలమటించు బిడ్డకేమి తెలుసు అమ్మ ఇంకరాదని
అమ్మనేది లేదని – ఆ బిడ్డకొరకు తల్లడిల్లు
ఆ తల్లి కెవరు చూపిస్తారు తన పక్కనె ఉన్న బిడ్డ శవాన్ని ॥క॥

కౌగిట్లో కనుమూసిన ఆలుమగలు వీళ్లు – కళ్లు కనిపించక
తన వాళ్ల కొరకు ఒంటరిగా బ్రతుకుతున్న ముసలివాళ్లు
తెలుగుతల్లి సిరిమువ్వల కంఠాహారలే
హతశినివులమృత పశువుల
అగ్రహారమే పోయె ॥క॥

★ ★ ★

# పక్కింటి అమ్మాయి-1981

చక్రవర్తి సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్. జానకి**

చిలకా పలకవే - కిటికీ తెరవవే
పక్కింటి చిన్నవాడు ప్రేమించే వన్నెకాడు
నీ కోసం వున్నాడు నువ్వు లేక బ్రతకలేడు

అందాల కిటికీలో ఉందొక్క చందమామ
నెలవంక చల్లగానే లేదు
నిలువెల్ల వేడి రేపింది
తాపాన్ని కాస్త తగ్గించమంట

ముసి ముసి నవ్వులు నవ్వగానే ముత్యాలే రాలునంట
రవంత కనికరిస్తే రత్నాలే దొరుకునంట ॥చి॥

నువ్వేమో చిలకైతే - నేనేగా గోరువంక
నావంక ఓరచూపుచూడు - నీ చెంత నా గుండె వాలునే
నీ మీద ఒట్టు నా జట్టు కట్టు
పాడాలి భావగీతం - ఆడాలి ప్రేమ నాట్యం
ఏలాలి ప్రణయ రాజ్యం
చిలకా పలకవే - కిటికీ మూయకే

* * *

# కొత్తనీరు-1981

సంగీతం : చక్రవర్తి

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్.పి. శైలజ

ఓయ్ మామ ఓయ్ మామ
సూసింది కాసింతసేపు ఏయ్ మామ
సేసుకొన్నావు ఎదనిండ సోకు – నీ ఎంటా
పడతంది నా మనసు

ఎవ్వరో ఎనకాల ఎక్కిరించినట్టుంది
ఎక్కిరిస్తే అళ్ల పళ్లే బయట పడతవి
దగ్గరైన ఇద్దరి కళ్లు కలుసుకొంటవి

పిల్లనవ్వు పలకరిస్తే సల్ల గుంటది
చూపుల్లో చురకలు గుండెల్లో ఉరకలు
చెప్పలేని వలపు లేంటో గుప్పు మంటవి

నాతోనే ఆసికాలూ ఊసులాడుకోవాలీ
మల్లెదండ సేతపట్టి మంచెకాడ నేనుంటే
మాపటేల నువ్వొచ్చి మరులు పెంచవా

సజ్జసేనుగట్టుకాడ సాప పరవనా
తొందరగా వుందమ్మో తొర తొరగా రావయ్యో
దూది నిమ్మ సెట్టు కింద దుప్పటుందిలే
లబ్జనకా టాంగు టకా

## 2

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

కొత్త సిగురు తొడిగింది అంటు మామిడీ
కోడాలొచ్చి మురిసింది ఇంటిచావిడీ

నిండుతనం వచ్చి నిగనిగలు పిచ్చి గుండెల్లో
పండగల్లే ఒకే సందడి – ఒకే సందడి ॥కొ॥

మునుపులేని అందాలు పచ్చ పచ్చగా
ముసుగులోని గుసగుసలు ఎచ్చ ఎచ్చగా

తోలికోడి కూత ఇప్పుడు ఇనిపించదు
నులక మంచం వదలాలని అనిపించదు ॥కొ॥

పొద్దపేళ పిల్ల ముఖం ముద్ద మందారం
బద్ధకంగా ఒళ్లిరిస్తే ఎంత సింగారం

అద్దరేతిరి దాటినా చక్కలి గింతలూ
నిద్దట్లోనూ అవే అవే పలవరింతలూ. ॥కొ॥

## 3

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రమణ్యం

ఏరు పొంగి వచ్చింది కొత్త నీరు
ఏరుపడితే పోయింది యింటి పోరు
వచ్చింది కొత్త నీరు – వచ్చింది కొత్త నీరు ॥ఏ॥

ఇంటింటా ఏవేవో తప్పలుంటవి
సేయిసేయి కలిస్తేనె సప్పడవుతదీ

నోరు మంచి గుంటేనే వూరు మంచిదీ
మంచోళ్ల సావాసం సల్ల గుంటదీ ॥ఏ॥

అన్ని రుసులుంటేనే తిన్నది బాగుంటదీ
ఉప్పూ కారం లేకుంటే సప్పిడి కూడౌతదీ

ఆమడలు దూరమైన అయినోళ్లు తనోళ్లె
కడుపుతీపి తలసుకోరా కమ్మగుంటది ॥ఏ॥

**4**

**పాడినవారు: ఎస్.పి. శైలజ**

ఊగిసలాడకె మనసా – నువ్వు ఉబలాటపడకే మనసా
ఊసు పోలేదనో ఆశగా వుందనో
ఉ(వ్రాత లూగకే మనసా ||ఊ||

తలలోన ముడిచాక విలువైన పూలైన
దైవ పూజకు తగవు మనసా – పొరపాటు చేశావో
దిగజారి పోతావు – నగు బాటు తప్పదే మనసా

పెడదారి మురిపాలు మొదటికే మోసాలు
చాలు నీ వేషాలు మనసా. ||ఊ||

తుమ్మెదలు సెలరేగి తోటలో ముసిరేను
దిమ్మరిని నమ్మకే మనసా దేశదిమ్మరిని నమ్మకే మనసా
చపల చిత్తము విపరీత మౌతుంది–
చెలించకే వెర్రి మనసా –
కపటాలు సరదాలు కవ్వించు సరసాలు
జాలు వారెనేమో మనసా ||ఊ||

## 5

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

సింతాసెట్టా కింది సికెలింత గద్దిసేమో
సిలకా మేసిందని సెప్పుకున్నారు
జాతిరామసిలక జామపండు తినక
నీతి తప్పి గడ్డి తింటుందా....

కట్టు కథా కట్టుకథా నమ్మలేని కట్టుకదా
కల్లా బొల్లి కట్టు కథా నమ్మలేని కట్టు కథా

సెంద్ర నిప్పులు సుట్టు సెదలు పట్టేనంటె
సెప్పేనోడి బుద్ధి సొప్పదంటే – కాశీ గంగ
తీర్థం వాసి తప్పేనంటె – సత్తె మున్నది సచ్చినట్టే ||సిం||

నూరేళ్ల కాపరాలు మసి బొగ్గులై పోతె
ఊరోళ్లు ఎగబడగ ఉట్ల సంబరమా
కారుకూత కూస్తే లేని నింద ఏస్తే
కంట నీరు – కడుపు చిచ్చేగా

★ ★ ★

# మరో కురుక్షేత్రం-1981

పద్మాలయా ఫిలింస్ సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

మనిషి ఓ మనిషి
ఎక్కడుంది ఎక్కడుంది మానవత
ఏమిటోయి ఏమిటోయి దానవత ॥ఓ మనిషి॥

న్యాయం గాయంతగిలిన నెత్తురు మడుగవుతుంటే
ధర్మం ఖర్మం ఒడిలో పడి దారుణమై పోతుంటే
కాలానికి శీలం చెడిపోయిందా ॥ఓ మనిషి॥

దేశం నీ ప్రాణంగా త్యాగం నీ ఊపిరిగా
భారతీయుడవై బ్రతకాలి భవితవ్యం తేవాలి
భారతీయుడై బ్రతకాలి
జ్వలిత కిరణ అరుణోగ్రమూర్తివై
గగన మంతా ఎరుపెక్కాలి
ఆ ఎరుపు వెలుగు నలుదిశలనుండి – మన
అరుణ పతాకం ఎగరాలి ॥ఓ మనిషి॥

## 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

అటు చూస్తే మరఫిరంగి మరణ సంగ్రామం
ఇటు చూస్తే బానిస బ్రతుకు బలి పీఠం

ఎన్నాళ్ళు సంకెళ్ళు ఎందుకు ఈ కడగళ్ళు
వద్దు వద్దు నైరాశ్యం మనకొద్దీ దాస్యం
పదండి పదండి పదండిరా.
ప్రచండ యోధులై పదండిరా
స్వాతంత్ర్య సమర వీరులై శూరులై

ఆ మధ్య మండుతున్న ప్రతి గుండె ఎర్రబడీ
ఆవేశం ఉడుకెత్తి ప్రతి మనిషీ తిరగబడీ

చురకత్తుల మెరుపల్లే వురకాలి – పడగెత్తిన దొరజాతిని నరకాలి
భారత స్వాతంత్ర్య మూర్తి శూరులై
కదనరంగమున కొదమ సింగమై ప్రళయతాండవంచేయాలి
అగ్ని పిడుగులై రక్త మడుగులై విప్లవాలు చెలరేగాలి

మరణ నినాదమై
విజయ దుంధుభులు మ్రోగాలి
రక్త చందనము జాతి శక్తినుదుటి తిలకమై నిలవాలి
దాస్య శృంఖాలాలే తెంచాలి
యింక్విలాబ్ – జిందాబాద్, విప్లవం వర్ధిల్లాలి.

# 3

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం**

ఏమి రాజ్యం ఏమి రాజ్యం ఏమి రాజ్యం
ఛ ఛ ఛ ఛ
చెప్పేదొకటీ చేసే దొకటీ ఇంకా ఎక్కడి రామరాజ్యం
ఉందామంటే కొంప తిందామంటే తిండె కట్టుకుందాం
అంటే గుడ్డ... ఏం రాజ్యంరా
||ఏ||

కొంపా గోడూ అమ్ముకొని డిగ్రీలెన్నో వెలగ బెడితే
కొలువు దొరికే ఆశలేదు గంజికి లేకాణలేదు

గరీబీ హరావో అంటూ గావుకేకలు పెడుతున్నారు
పేదరికాన్ని తరిమేస్తామని పేదలనే తరిమేస్తున్నారు
షేమ్ షేమ్ సిగ్గు సిగ్గు ఏం రాజ్యంరా ||చె||

పగలు రాత్రి పాట్లెన్నోపడి బంగారాన్ని పండిస్తుంటే
అమ్మపోతే అడవైపోయే – కొనపోతే కొరివై పోయె
ఉప్పెనలా విజృంభించండి విప్లవగీతిక ఎలుగెత్తండి
అవినీతి అన్యాయం దురాగతం ..... ఛ ఛ
ఇంకా ఇంకా ఏం తింటారు – ఎందుకు చూస్తూ కూర్చుంటారు
దౌర్జన్యందీపం చుట్టూ – యీాసెళ్లల్లా
తిరుగుతు తిరుగుతు – విప్లవజ్వాలకు మసికావాలి

## 4

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

మరో కురుక్షేత్రం పోరాటాని సాగించిన సమరణ క్షేత్రం

కొట్టు కండిరా ఏమిటి ఈ ఘోరం
రక్తం మడుగు చేసిన కురుక్షేత్రం
అన్నదమ్ములను చీల్చిన కుట్రల కురుక్షేత్రం
రాజ్య కాంక్ష రక్త మడుగు చేసిన కురుక్షేత్రం
కానేకాదు కాదిది కురుక్షేత్రం – పోరాడను రణక్షేత్రం

క్రాంతి పథ చైతన్యం – సమైక్యత మన లక్ష్యం
ఒరేయ్ సంపుకోండిరా చంపు కోండిరా పిస్నోడు
వాణ్ణి నిన్ను కలిసి చంపుకొండి – మీరంతా కలిసి నన్ను చంపండి
ఇదంతా మరో కురుక్షేత్రం – స్మశాన వాటికగా మార్చండిరా
ఈ శవాలన్నిటిని పీక్కు తిండానికి రాబందులు
కాచుకు కూర్చున్నాయిరా – చంపుకొండిరా – వెధవల్లారా
చంపుకొండిరా

రాజకీయాల్లో బంధుత్వాలకి తావేలేదు
అది బతకడానికి వీల్లేదు – అది బతికితే వాళ్ళిద్దరేకమవుతారు
వాళ్ళేకమైతే – మనం బతకం – అదే రాజకీయం

క్రాంతి పథం చైతన్యం సమైక్యతే మన లక్ష్యం
దురన్యాయ దోపిడీలో స్వార్థపరుల రాపిడిలో
ఎదిరించిన మహోజ్వలిత యువత కురుక్షేత్రం ॥మరో॥

* * *

# రహస్య గూఢచారి-1981

శ్రీకాంత్ పిక్చర్స్ సంగీతం : సత్యం

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం

ఎహే పిట పిటలాడే పిట్టా
నువే బిగుసుకు పోతే ఎట్టా
కన్నేస్తే కరగాలి ఈలేస్తే వాలాలి
నేనే నీ జోడీ రావే ఓ లేడీ

ఆడాలి నువ్వు నేనూ డార్లింగ్
పాడాలి కలిసి మెలిసి లవ్ సాంగ్
మురిపించే యిద్దరి జంట
మోగాలి వలపుల గంట సోలాంగ్ గుడ్ బై ||పి||

పంతాలు పట్టావంటే పటాపట్
సంతోషం యిచ్చావంటే చటాచట్
చెవిలోన చెప్పిన మాట
చెల్లిస్తే ముద్దుల మూట గుడ్‌బై టాటా ||పి||

**2**

**పాడినవారు: ఎస్. జానకి బృందం**

వెంటాడి తేనే చిక్కేనా వేటాడితే నే దక్కేనా
నీ మోటు సరసాలు చాలించరా
మోజుంటె మనసార ప్రేమించరా
అప్పుడే — ఓం శాంతి ఓం శాంతి ||వె||

పిల్లంటే అలుసా ప్రేమంటే తెలుసా
చెయ్యొద్దురా అల్లరి — నచ్చాలి మనిషి మెచ్చాలి మురిసి
వచ్చేను అప్పుడే ప్రేయసి
ఆడది వలచి వచ్చిన నాడే
మగాళ్లు మొనగాళ్లు

ఆ ఆడది ఎదురు తిరిగిందంటే — తోకలు ముడిచేరు
సరసాలు విరసాలు కావాలిరా
అప్పుడే ఓం శాంతి ఓం శాంతి ||వె||

అమ్మాయి కోసం ఓ ప్రేమ పాఠం నేర్పించనా — ముందుగా
సిన్నోడి సూపు చినదాని రూపు కలవాలిరా హాయిగా
కన్నూ కన్నూ కలిసిన నాడే కలుగు మోహాలూ
మిన్ను మిన్ను మరచిన నాడే తీరును దాహాలు
మైకాన మునగాలి దేహాలు
అప్పుడే — ఓం శాంతి ఓం శాంతి ఓం శాంతి ||వె||

★ ★ ★

# ప్రేమమూర్తులు-1982

రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, రమోల**

చెంపకు చారెడు కళ్లు - ఒంపులు తిరిగే ఒళ్లు
చిటికేస్తే చిర్రు బుర్రు - ఉడికిస్తే - తుర్రో తుర్రు
జోరెంతసేపు రవ్వంతసేపు ఎందుకు ఆకోర చూపు.

యూ - యూ - యూ

కయ్యాని కొచ్చింది కాలేమో దువ్వింది వయ్యారి గయ్యాళి గుర్రం
కొంటాను అంటుంది తంటాలు పెడుతుంది - వేయారి నోటికి కళ్లెం

తుళ్లేటి వయసుంది తోడెవ్వరే నాకు పిల్లా
రుసరుసలు బుసబుసలు రోషాలు చూపిస్తే ఎల్లా
కలవారి కూతురా పోటీకివస్తావా భేటీకి వస్తావా
డోంట్ బాదర్ మీ

ఒడ్డుంది పొడుగుంది ఊరంత గీరుంది వల్లంకి పిట్టరూపం
నీలైన బుగ్గుంది కోటేరు ముక్కుంది ఆముక్కుమీదే కోపం
పొగరుంది వగరుంది పోకిళ్లు పోతుంది పొంకం
ఆడించె యీడుంది .... డీడిక్కు అంటుంది బింకం
తగాలి అమ్మడూ మాట్లాడు కుందామా పోట్లాడుకుందామా
ఐ సే - కిల్ యూ

## 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

సిరిసిరి మువ్వల నవ్వు
చెకుముకి రవ్వల వెలుగు
నీ కోసమే సుస్వాగతం అంటున్నది
వలపుల కథకిది తొలిపలుకు
తొలకరి జల్లుల చిరుచినుకు

చల్లని మనసే పూచింది
మల్లెల మాలిక కట్టింది – నిను చేరి మెడలో వేసింది

మురిపాల పూలు నీ ఆనవాలు
మనసేమో మందారం ఇంపైన సంపెంగ వయ్యారం
పూదోటలో విరిబాటలా పయనించుదాం
కమ్మని కలలో కాపురమూ చక్కని వలపుల మందిరమూ
మోహన మురళీ మ్రోగిందీ మంజులగానం సాగిందీ
నా మేను నాట్యం ఆడింది.

హృదయాలలోన కెరటాలు వీచె
సరిగంగ స్నానాలు సరసాల జలకాలు ఆడాలి

అనురాగమే ఆనందమై మన సొంతమూ
అందాల హరివిల్లు పూచిన ప్రణయం – పొదరిల్లు

## 3

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

చిటారుకొమ్మల చిన్నారి గువ్వల గూడుంది చూడు చిన్నమ్మ
గూడెక్కి గువ్వ జోడీని కూడి కులికింది చూడు బుల్లెమ్మ
గూడెక్కడుందో గువ్వెక్కడుందో
గువ్వక్కడుంది గూడిక్కడుంది
చేరుకో - సంబరం - చేసుకో మనసారా ||చి||

చిటారు కొమ్మల చిన్నారి గువ్వల గూడుంది చూశా చిన్నోడ
అల్లారుముద్దుల ఇల్లాలు గువ్వ ఆటాడమంది బుల్లోడా

ఆలేమిటాట అనువైన చోట
ఆడింది ఆట - పాడింది పాట ఆడుకో - సంబరం చేసుకో మనసారా

ఇల్లలికి ముగ్గెట్టి ఆ కేసి పీటేసి
పేరు పేరు అందాలు ఆరారా తిసిపిస్తే ఆరగిస్తావా అబ్బాయి

వంటింటి తలుపేసి నట్టింటి తలుపేసి పడకింటి తలుపేసి
అత్తారింటికి దారే దంటె - కొత్త కొత్త సిగ్గులా అమ్మాయి

చప్పట్లు తాళాలు సరసాల మేళాలు
మురిపాల పందిరేసి అందాల సందడైతె ముచ్చటించుతావా అమ్మాయి

పనసపండు తీసుకొచ్చి పదిలంగా కోసిపెట్టి పళ్లెంలో వడ్డిస్తే
తినలేని మా రాజు దిక్కులు చూస్తే
దిక్కు దిక్కు మంటాను అబ్బాయి
ఆడుకో - సంబరం చేసుకో మనసారా

**4**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

ఊరుకో ఏడవకు – ఊరుకో
హృదయానికి గాయమైతే తేరుకో

అంతులేని వేదనలో పొంగుతుంది బాధ
తేరుకొని నవ్వితే – తెలుస్తుంది మమత ||ఊ||

కంటినీటి కాలవల వెంట నడవకు
కడుపులోన చిచ్చున్నా పెదవి విప్పకు

ఆపలేని అభిమానం కోపమైనా
అలిగినా నలిగినా అనుబంధం ఎన్నటికీ వీడదు

ఎంతకాలముంటుంది చిమ్మ చీకటి
తెల్లవారి పోగానే వెలుగు సందడి ||ఊ||

చింతలందు చిరునవ్వులు చిగురు వేయనీ
సొంతమైన మమకారం చెంత చేరనీ

మధుర మధుర స్మృతులన్నీ మధువు చిందీ
మాటలలో చేతలలో పొందులో మనసు పండనీ

అలుమగల అన్యోన్యం మధుర భావన
పాలూ తేనెల కలయికయే పరమ దీవెన ||ఊ||

★ ★ ★

# అందగాడు-1982

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

నన్ను రారా బాబూ రాజా అంది లోకం
కన్న తల్లికి మల్లె చేతులు చాచే మేఘం
పూల ఊయల లూపు గాలి
బాల కోయిల ఏదో జోలల్లు పాడే నా కోసం ॥న॥

ఆమనిలో విరిసిన కన్నెపూవు సోకులకే
రేకులా కొంటెనవ్వు ఏమరి - వాలి చెవులో సంధ్యారాగం

ఎవరి కోసమో ఎందుకో యింత బిడియం
మలయ సమీరం మంజులగానం కలసి మెలసి
కమ్మని భావం - అందాలు చిందేసె నేడు నా కోసం ॥న॥

తుమ్మెదలే కమ్మగా చేసే నాదం
జలపాతం మెల్లగా వేసే తాళం
చిన్నారి పొన్నారి చిలిపి గీతం
చేసెనుగా పాపను నన్ను సైతం

సూర్యుని కిరణం అతి సుకుమారం
మండదు ఎండ - మందార గంధం
ఆ స్వర్గం దిగి వచ్చే నేడు నా కోసం ॥న॥

## 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్. జానకి**

వచ్చిందిరో లేడి నీకు హెచ్చిందిరో వేడి
ఇక తెల్లారదు నీ గుండె అల్లాడదు
నాలో మిస మిసలాడే పరువాలు – నీలో గుసగుసలాడే సరదాలు
నీతో కాకుంటే నా కంటికి నిదర రాదు – ఇక
అదరు చేయకు చెల్లా చెదరు
అందగాడా రాముందుకు – కన్నె పొగరు వగరు ఎంతో నదరు
విందుకెళ్తే – తిన వెందుకు ||వ||

నేనే కలియుగ కృష్ణావతారం
రాసక్రీడకు రాదే అవకాశం
నువ్వు సై అంటే తియ్యనైన సయ్యాట కొస్తానే
నిన్ను పిలిచి వలచి మదిలో సంకెళ్లు వేస్తానే
స్నేహం కలిసిన మోహం కలిగేనే
మోహం కలిగిన దాహం తీర్చాలీ

బందీనైనా గానీ నీ కెందుకింత తొందర మొనగాడా
చూడు మనలోన మనకు కుదిరే మనసు
లేని పోని జాగెందుకు

అయ్యో నిన్ను నన్ను లోకం కన్ను చూస్తుంది
పోదాం – పద చాటుకు ||వ||

**3**

**పాడినవారు: ఎస్. జానకి, కమలహాసన్**

ఊగుతోంది లోకం - చెరుగుతోంది మైకం
ఊసులాడి ఒకపాట పాడి శృతి నేర్చుకుంటే మధురం

శివుడి విల్లు విరిచి రాముడు సీతను గెలిచేసే
నే మరుని విల్లు తలచి రేపటి మధువు వెంచుకొన్న

ఆమె ప్రాణమా మధుపానమా
కైపు ఏది అధికం ||ఊగు||

కృష్ణా రమ్మా అంది రాధ తృష్ణ తీర్చమంది
నిన్నే నేను కలిసీ ఇదిగో నీకై మనసు తెరిచా

వన్నె చిన్నెలకు వయసు పొంగులకు
వేయగలను పగ్గం. ||ఊగు||

* * *

# సుబ్బారావుకి కోపం వచ్చింది-1982

త్రిమూర్తి పిక్చర్స్ సంగీతం : చక్రవర్తి

**1**

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్. పి. శైలజ

హేమల్లి – మల్లి మల్లి
ఏం మల్లి జాజి మల్లి
ఏం జాజి సన్నజాజి
ఏంసన్న నడుముసన్న
హే నడుముసన్నని చిన్నదాని ఉడుముపట్టు
పట్టావంటే నలిగిపోతుంది నడుము పెరిగిపోతుంది

నడిరేయి దాటి పోతోంది – నా నా చెయ్యి నువ్వు వదులు
నా యిల్లు చేరుకోవాలి మా వాళ్లు మండిపడతారు

తెల్లార్లు నాతో ఉంటానని మాటిచ్చి
నన్ను వూరించి ఇప్పుడు నువ్వు
తప్పుడు సాకు చెప్పమాకు జారిపోకు
వదిలి పెడతానా నిన్ను కదల నిస్తానా

ఆడజాతి బెట్టు చూపాను
లేకుంటే ఊసు పోతుందా
అబ్బాయి ఆశ చూశాక అమ్మాయి తీసిపోతుందా

అల్లాగ దారి కొచ్చావా ఈ రాత్రి నవరాత్రి
చెట్టా లేసుకుంటూ చిటికలేస్తూ చిందులేస్తూ
కలసి పోదామా – కలసి కరిగిపోదామా ॥మల్లి॥

**2**

**పాడినవారు: ఎస్. పి. శైలజ**

దాచాను ఎన్నో దాచాను
నువ్వు ఊ అంటే – నువ్వు సై అంటే నీకే యిస్తాను
జిగి బిగి సొగసు జిలిబిలి మనసు
నిగనిగ వయసు నీకే యిస్తా

నిన్ను చూసీ చూడగానే నన్ను నేనే మరిచిపోయా
కన్ను వేసీ వేయగానే వెన్నలాగా కరిగిపోయా

చూపులు కలుపు చేతులు కలుపు
కోరిన వలపు ఉంచాను – అది నీకే యిస్తాను ||దా||

నువ్వు లేక బ్రతకలేను – నవ్వకుంటె వూరుకోను
వాటమైన వయసు నాది నీటి పాలు చేయమాకు

ఒంపులు తిరిగే వయ్యారాలు
వన్నెలు చిన్నెలు వుంచాను అవినీకే యిస్తాను ||దా||

★ ★ ★

# రక్త సంబంధాలు-1983

నవచిత్ర ఎంటర్‌ప్రయిజెస్ సంగీతం : సత్యం

**1**

**పాడినవారు: పి. సుశీల**

అనురాగ శిఖరాన ఆలయం
ఆగుడిలోన ఆనంద జీవనం

సంసార దీపం – సంతోష రూపం
మురిపాల ఆరాధనం

ఏనాడు ఏ చోటవున్నా అనుబంధమే పావనం ||అ||

గుండెలలో గుడి ఒకటుందీ
గుడి వెనుక తోటొకటుందీ
గున్నమావి కొమ్మమీద చిలకలు
పలికినవే పంచదార పలుకులు

ఏనాడు ఏ చోట వున్నా – అనుబంధమే పావనం ||అ||

మమకారమే ఆరని జ్యోతి – అది
మదిలోన చల్లని శాంతి

దూర దూర తీరములనావలు
చేరువగా చేర్చవే మమతలు
ఏనాడు ఏ చోట ఉన్నా – అనుబంధమే పావనం ||అ||

## 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్. జానకి, పి. సుశీల**

జస్టె మినిట్ చిన్నమాట
ఈ వయసే చిలిపి ఆట
ఆడే ఆటలే ప్రేమబాటలు

ఓర చూపు చూడగానే – పొంగుతాడు మగవాడు
కోర చూపు చూడగానే తోకముడుచుకుంటాడు

బాబుగారు అంతేలే –తన
డాబులన్ని ఇంతేలే ॥జస్టె మినిట్॥

వెంటపడిన వేళలోన
కొంటెవాడు అంటుంది – జంట కోరుకుంటుంది
కంటపడక దూరమైతె జంట కోరుకుంటుంది.

కామెర్ల కళ్లకేమో – పచ్చగానే కనబడుతుంది
ఆ సామెత అమ్మాయికి అక్షరాలా సరిపోతుంది

కీచులాట మానాలి
దోబూచులాట ఆడాలి. ॥జస్టె మినిట్॥

## 3

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, రమోల**

ఇలారా మిఠారి
భలెమాల్ కఠారి
అరె మాకీ మీకీ మంచి జోడ కలవాల
మత్తులోన మనసుతీర కులకాల
పటిక బెల్లంలా మనసు వూరిస్తావ్
మామిడల్లంగా మనసు లాగేస్తావ్

ఇలా నవ్విస్తే కవ్విస్తే హోయ్ – తమాషా
మరి ఉడికిస్తే చూపిస్తా మాకి తడాఖా ||ఇ||

అల్లీ బిల్లీ ఆడపిల్ల రావాల – నువ్వు
మళ్ల మళ్ల మాతో సరస మాడాల

మీకీ సోగసుంటే – మాకీ షో కుంది
మీకీ వగరుంటే – మాకీ పొగరుంది ||ఇ||

ఖుషీ నజరానా ఇవ్వాల ఓ హసీనా
నిషా పెరగాల – ఏలాల నయ జమానా
వానా మబ్బు సూసి నెమలి ఆడాల
మీకు గానా హింటే బుల్ బుల్ పిట్ట వాలాల ||ఇ||

**4**

**పాడినవారు: పి. సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

కట్టింది చెంగావి చీర
అహ తొడిగింది సరిగంచు రైక – మెరిసింది
దాని ధగ ధగ ఎందుకో. ||క||

దాని బిగువుల పిటు పిటలన్నా
వాని నగవుల చిటపటలన్నా
అలరించే మొనగాడు ఎవరో ||క||

మురిసింది వగలాడిరూపు – ఇంకా
పడలేదు మగవాడి చూపు

దాని కులుకుల ఘుమ ఘుమలన్నా
దాని తలపుల తహ తహ లన్నీ
విర బూసి పండేది ఎప్పుడో ||క||

★ ★ ★

# అమాయకుడు కాదు అసాధ్యుడు-1983

సంగీతం : చక్రవర్తి

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్.పి. శైలజ**

హో హో హో.... ఏంటిది నే నెక్కడున్నాను
నేల మీదా నింగిపైనా

ఇది అల్లి బిల్లిలోకం ఆశతీరే లోకం
పొంగుతున్న ప్రాయం రంగు రంగుల స్వప్నం
చీకూ చింతా వావీ వరసా ఏమీలేని స్వర్గం.

ఆహో హో – ఇదా స్వర్గమూ.
ఏ హె హే – ఇదా స్వర్గమూ.

రకరకాల రాసలీల కన్నుల విందు కల్గిస్తుంటే
కలుగుతుంది నీకు కోరికా

నీ ముద్దు తీరేను సరిహద్దు చెరిగేను
సరసాల కరిగేనులే.

ఇదా స్వర్గమూ ఇదే స్వర్గమూ
మునుపు లేని అనుభవమేదో

ఇపుడే తెలిసే వేళ – ఆకతాయి నాలో చిక్కేనేదో
ముల్లోకములు తిరగాల – సిగ్గేల ఆనందం పొందు
ఆహోహో – ఇదే స్వర్గము.

## 2

పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

వినాలి మగాడి గుసగుసలు – మితారి కేల రుసరుసలు
వేసిందల్లా నాటకం – చూసిందల్లా బూటకం – స్నేహంకోసమే
ఇంతలో అంత చిరాకా మురిపెం కోసరమె నాపై చినదానా ॥వి॥

సరిగమ పాటతో సరి సరి అంటాలే
సరాగాల పేచీ నాతో ఎందుకే

అనుమానములే పెనుభూతములు – ఓ సరోజా
అంటే అనురాగంతో అనుబంధంతో – ఇక
వినోదాల పంటే – అవునాకాదా ఓ పిల్లా. ॥వి॥

చాలు చాలు చప్పట్లు సరసాలైతే ముచ్చట్లు
ఇలా కదిలి రావే – ఎంతో వేడుక

మది చల్లనిదే – ఎద వెచ్చనిదే ఇది వయారాల జల్లు
మన ఇద్దరిలో మన ముద్దులలో ఇక విషాదాలు నిల్లు!

అవునా కాదా ఓ పిల్లా ఓ పిల్లా. ॥వి॥

★ ★ ★

# పెళ్లి పుస్తకం-1984

శ్రీసీతారామ ఫిలింస్ సంగీతం : కె.వి. మహదేవన్

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

సరికొత్త చీర వూహించినాను
సరదాల సరిగంచు నేయించినాను

మనసు మమత పడుచు పేకా – చీరలో చిత్రించినాను
ఇది ఎన్నో కలల కలనేతా – ఇది
నా వన్నెల రాసికి సిరి జ్యోతా.

ముచ్చట గొలిపే మొగలి పొత్తుకు
ముల్లూ వాసన ఒక అందం.

అభిమానంగల ఆడపిల్లకు అలక కులుకు ఒక అందం
నీ అందాలన్నీ కలబోశా
ఈ కొంగుకు చెంగున ముడివేస్తా

ఇది ఎన్నో కలల కలనేత – నా వన్నెల రాసికి సిరిజ్యోతా.

చురు చుర చూపులు ఒక మారు – నీ చిరు చిరు నవ్వులు ఒకమారు
మూతి విరుపులు ఒకమారు – నువ్వు ముద్దుకు సిద్ధం ఒకమారు

నువ్వు ఏ కళ నున్నా మా బాగే
ఈ చీర విశేషం – అన్నది ||సరి||

## 2

### పాడినవారు: పి. సుశీల

ఆయి ఆయి శ్రీ రంగా శాయి
మా పెద్ద పాపాయి ఆపదలు కాయి
ఏదీకాని వేళ ఎడద ఉయ్యాలా
కోరి జో కొట్టింది కుసుమ సిరి బాలా ॥ఆయి॥

అజ్ఞాత వాసాన అతివ పాంచాలి ఆరళ్లు భీమ్మన దూరమ్ము చేయు
ఆవేశపడరాదు అలసి పోరాదు
అభిమానమే చాలు అణచుకొనమేలు

నిద్రా కన్యలు వచ్చి నిలదీసి దీవిస్తే
భద్ర కన్యాకలేమో పలికె తథాస్తు

మాగన్నులోనైన మరిచిపో కక్ష
విరికకు నిదురయె శ్రీ రామరక్షా ॥ఆయి॥

## 3

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం

పపప్ప పప్పా ధప్పళం
అన్నం నెయ్యి ... వేడి వేడి అన్నంమీద కమ్మని పప్పా కాచిన నెయ్యా
పప్పా ధప్పళం – కలిపి కొట్టడం.
భోజనం – విందు భోజనం.
వన భోజనం – జన రంజకం. ॥వన॥

తల్లీతోడు, పిల్లమేక ఆలుమగలు అత్త కోడలు
బాసూ బంటూ ఒకటే నంటూ
కలవడం – భోజనం – వన భోజనం. ॥భో॥

మన వయసుకు నచ్చినట్టి ఆటలు
మన మనసుకు నచ్చినట్టి పాటలూ – పాడితే
రంజనం – జనరంజనం.
సరిగా సారిగా మామ.....

మసాళ గారెలూ మా – జిలేబీ బాదుషా పాపా
సపోటా తీసుకో తాతా పొటేటో చిప్సుతో నా
మిఠాయి ఖావురే రీ... పకోడీ తిందు నా...
మలాయీ పెరుగిది టోమోటో చెట్నీ – ఇది
పసందూ పూర్ణమూ బూరెనీ నల్చుకో – కారప్పూ సా

అసలైన సిసలైన ఆంధ్రత్వ ట్రేడ్ మార్కు
మిరపకాయి బజ్జి కొరికి చూడు

గోంగూర పచ్చడి గొడ్డు కారపు ముద్ద
మినపట్టు ముక్కతో మింగి చూడు

ఉల్లిపాయల మధ్య అల్లము జల్లిన
పెసరట్టు ఉప్మతో మెసవి చూడు.

గసగసాలే మిరియాలు కారా లవంగాలు
నాణ్యమౌ ఏలకులు నమిలి చూడు

తెలుగు తనమున్న తిండిని తినినవాడు
తనకు తెలియక హాయిగ తనువూగ

పాట పాడును తప్పక – ఆటలాడు.
డాన్సు రానట్టి వాడైన డాన్సు చేయు.

అరెసెలు – బూరెలు వడలు
ఆవడ బొండాలు కజ్జి కాయలూ
కరకరలాడు జంతికలు – కమ్మని ఘుమ్మని నేతి చిప్సులు
కరముగ నోరూరగల – కారపు పచ్చడి – తీపి జాంగిరీ
త్వర త్వర సర్వు చేయవలె
తై తక్క లాడవలె పికినిక్కులో॥

## 4

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

శ్రీరస్తూ శుభమస్తూ
శ్రీకారం చుట్టుకుంది పెళ్లి పుస్తకం
ఇక ఆకారం దాల్చుతుంది కొత్త జీవితం ||శ్రీ||

తలమీద చెయ్యివేసి ఒట్టు పెట్టినా
తాళి బొట్టు మెడను కట్టి బొట్టు పెట్టినా
సన్నికల్లు తొక్కినా సప్తపదిని మెట్టినా
మనసు మనసు కలపడమే మంత్రం పరమార్థం ||శ్రీ||

అడుగడుగున తొలి పలుకులు గుర్తుచేసుకో
తడబడితే పొరబడితే తప్పు దిద్దుకో
ఒకరి నొకరు తెలుసుకునీ
ఒడి దుడుకులు తట్టుకొనీ
మనకేయని పున్నమిలా
మనకి నింపుకో. ||శ్రీ||

**5**

**పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

అమ్మకుట్టి అమ్మకుట్టి మనసు లాయో
కిట్టమూర్తీ కిట్టమూర్తీ తెలుసు లేవోయ్
ఓ.... అసలే విరహం అయ్యో దూరం ఎల్లాగున్నా...
ఓ ... చారెడు పిడికెడు బారెడు - పిల్లా ఎల్లాగున్నావు
చెంపకు కన్నులు బారెడు
సన్నని నడుము పిడికెడు
దువ్వీ దువ్వక పువ్వులు ముడిచిన
నల్లని నీ జడ బారెడు.... తెగ బారెడూ.
మనసు లాయో..... ||అ||

అయ్యో పాపం అశాంతి కాలం ఎందాయొ.
ఓ.... గుటకలు చిటికెలు కిటుకులు అబ్బో చాల గడుసు
కులుకులు చూస్తే గుటకలు
సరసకు రమ్మని చిటికెలు
చక్కని చిన్నది అందం చంచం సేవించాలని కిటుకులు
మనసులాయో.... ||కి||

మనసులాయో అమ్మకుట్టీ
గుండెల్లోనా గుబగుబ లాడే
ఊహలు ఊరెను ఉవ్విళ్లూ

పరవశమైనా మా శ్రీవారికి
పగ్గాల్లేనీ పరవళ్లు

చుట్టూ చూస్తే అందాలూ
లొట్టలు వేస్తూ మావారూ
అక్కడ తమకు - ఇక్కడ మనకు
విరహంలోన వెక్కిళ్లు

మనసు లాయో .... అమ్మకుట్టీ. ||అ||

★ ★ ★

# అమెరికా అబ్బాయి-1987

అన్నపూర్ణా పిక్చర్స్. సంగీతం: ఎస్. రాజేశ్వరరావు

**1**

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం**

దేవుని దయ వుంటే దొరబాబులం
స్వయంగ పని చేస్తే యజమానులం
నిన్నటి గరీబులం రేపటి అమీరులం
మనలో మనం అంతా సమం ఒకటే కుటుంబం ॥దే॥

స్వదేశమైనా విదేశమైనా సమానమనుకోరా
పాటుపడ్డచో కూటి కెన్నడూ లోటు రాదుగదరా
చదువుసంధ్యలున్నా – ఉద్యోగాలు సున్నా
శ్రమయే సుఖం చెమటే ధనం స్వశక్తి ప్రధానము ॥దే॥

విహార యాత్రలు, వినోద యాత్రలు వికాసమిస్తాయి
కొత్త చోటుల కొత్త మనుషుల పరిచయం తెస్తాయి
మంచివారి కెపుడూ మంచి జరుగుతుంది
జనతా రథం సమతా పథం జరిపే ప్రయాణము ॥దే॥

★ ★ ★

# మిస్టర్ పెళ్ళాం-1991

శ్రీ చాముండీ చిత్ర

సంగీతం : ఎమ్.ఎమ్. కీరవాణి

## 1

**పాడినవారు: పి. సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

అడగవయ్యి అయ్యగారి – ఎక్కువేమిటో
అలా అడగవయ్య – ఆ ఎక్కు వేమిటో
చెప్పమను – ఆడవాళ్ల తక్కు వేమిటో
ఆ ఎక్కు వేమిటో – ఈ తక్కువేమిటో. ||అ||

పదునాలుగు భువనాలన్నీ పాలిస్తున్నాను – పరిపాలిస్తున్నాను.

ఆ భువనాలను గివనాలను – పోషిస్తున్నాను – నేనే పోషిస్తున్నాను.

సిరిలేని హరి ఉట్టి దేశదిమ్మరి
నే అలిగి వెళ్లేదా – తనకు లేదు ఠికాణా

ఆ ఏడు కొండలవాడి కథా నువ్వు చెప్పేదీ? కానీ
పెళ్లి కోసం తిప్పలు – చేశాడండీ అప్పులు – నాతో
పెళ్లి కోసం తిప్పలు చేశాడండి అప్పులు

వడ్డీ కాసులవాడా వెంకటరమణా. గోవిందా. గోవింద.
కొండ మీద నేను – మరి కొండకింద ఎవరో? అడగవయ్యా
నడిరేయి దాటగానే దిగివచ్చేదెవరో ||అ||

త్రేతాయుగమున నేను
శ్రీరామ చంద్రుడినీ

అయినా సీతాపతి అని పిలిచారండీ మిమ్ము
సీతాపతి అని పిలిచారండీ

నరకాసుర వధ చేసిన కృష్ణుడినీ – తెలుసా?
సత్యభామని విల్లంబులు తెల్లంబున పట్టిన
సత్యభామని – వీరభామని

భామగారి నోరూ – భలే. జోరు జోరూ
మొగుడిని దానమిచ్చినారు – మొగసాల కెక్కినారు
ఆతులాభారం – అదో లేల భారం.
బలె మంచి చౌక బేరము
సవతి చెంత కాళ్ల బేరము!

అయ్యో దొరగారి బరువు – తులసి దళం బరువు!

సత్యం సత్యం పునః సత్యం....
శ్రీమదే రమారమణ గోవిందో – హరిః.

# 2

**పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం**

మాయదారి కిట్టయ్య
ఎంతటి వాడూ ఓరయ్యో
ఆ... నాటకాల బూటకాల
కాటు నీడు వాడూ ఓరయ్యో. ||మా||

ఆడదాన్ని చూసి ఆగలేడు వాడు
ఆశరేపుతాడు ఊసులాడు తాడు
రాసక్రీడలాడు మంత్రగాడు ఆ ||మా||

పొరుగింటి పాలు – ఇరుగింటి పెరుగు
మరగినాడు వెన్న దొంగా.
ఆపాల కడలి యజమానుడైనా
పరుల పాడి కోరనేలా
ఎంతవారికైన ఎదుటి సొమ్ము తీపి
ఏమి దేముడండి అన్నులాడి మోజు జాస్తి ||మా||

పదహారు వేల సతులున్నవాడు
రాధనేల వీడడంట
ఆ మేనయత్త తొలి వలపు ఖాతా
మొదటి ప్రేమ మరువడంట
వాడి దివ్యలీల కావ్యగీతమాల
చెప్పినాను చాలా – పాడుకొండి భక్తులార ||మా||

★ ★ ★

# పెళ్ళికొడుకు-1996

శ్రీ సీతారామ ఫిలింస్      సంగీతం: ఎమ్.ఎమ్. కీరవాణి

## 1

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

ఎగిరి పోతున్నావే – పొగరు చిలకా
చివరికేం చేస్తావే – తిరిగి రాకా
దూరమెటు పోలేవు – పోలేవు లే
దారికిక వస్తావు చూస్తానులే.
నేటి వగలన్నీ నగలాయె పాడుకో కాపాడుకో
అవి కాపాడుకో లేవికా. ॥ఎగిరి॥

నీ పెదవిముందు బలాదూరు పగడాలు
నీకురుల ముందు దిగ దుడుపు నీలాలు
నీ చెంపలకు – తీసికట్టు కెంపులూ
నీ వంపులే సొగసు చాటింపులు
నునులేత మైచాయ పుష్యరాగాల ఓడించులే. ॥ఎగిరి॥

నీకంటు కలవు కోటి వజ్రాలు
నీ పంటి మెరుపు సాటిరావు ముత్యాలూ
నీ కులుకు ముందు రతనాలే గులకరాళ్ళు
నిన్ను చూడగ కావాలి – వేయికళ్ళు
దొరసాని పరువాలు దిష్టి తగిలేను దాచేసుకో
ఎవరేనా దోచారో – నిను కాస్తాను గుర్తుంచుకో ॥ఎగిరి॥

## 2

### పాడినవారు: చిత్ర

చూడు చూడు చందమామామా చూడు
ఈ కోడెగాడు నిద్దురే పోడు
పక్కగదిలో ఒక్క దాన్నని
పక్కమీద చేరేటట్టున్నాడు – నా
పక్కమీద చేరేటట్టున్నాడు. ||చూ||

తడిసిన కురులను దువ్వి జడవేయనా అంటూ
మెడమీద పుట్టుమచ్చ తరిమేయనా అంటూ
ఈ ఉదయం అన్నాడు – ఎలాగో ఎలాగో వున్నాడు
ఆదమరిచి పడుకుంటే – తెగ అల్లరి
చేసేటట్టున్నాడు – ||చూ||

ఎడదపైన పయ్యెదలాగా ఒదిగిపోనా అంటూ
చిరునడుము పిడికిట పొదిగి సరిచూడనా అంటూ
సాయంత్రం అన్నాడు సన్నసన్నగా నవ్వుకున్నాడు
వీలు చిక్కితే ఓరినాయినో –
కిటికీలోంచి దూకేటట్టున్నాడు –
నా అందమంత దువ్వేటట్టున్నాడు ||చూ||

పొన్నపూల మాటున నక్కి చందమామా
ఈ చిన్నోడి చేష్టలు చూస్తున్నావా? చూస్తున్నావా?
పండు వెన్నెల మత్తుజల్లి పైరగాలి జోలపాడి
మెల్ల మెల్లగా జో కొట్టవా యీ నల్ల నోణ్ణి
పడుకోపెట్టవా – లేకుంటే
కొంపతీసి ఈ రాతిరే – నన్ను
కొల్లగొట్టి పోయేటట్టున్నాడు. ||చూ||

## 3

### పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం బృందం

జయము జయము చలన చిత్రసీమకు – జయము జయము
కనుడీ ప్రియతమ ప్రేక్షకులారా ఒక పెండ్లి కొడుకు కథను తందాన.

వచనం: ఎటువంటి పెండ్లి కొడుకు కథ
కలిమి లేముల తోడ చెలగాట మాడిన
గడుసు బిడ్డ కథను ||తందానతాన||

గాజుపూసల మధ్య ఘనమైన రత్నాన్ని
గుర్తుపట్టు కథను ||తందాన తాన||

అనగనగా మన ఆంధ్ర నగరిలో ధనికులుండుచోట ||తందాన||
నందనవనం తలదన్నే అందమైన తోట ||తం||
ఆ తోట నడుమ నమిరే – చక్కని పాలరాతి తోట ||తం||
ఆ కోటను నీటుగ పరిపాలిస్తున్నది ఓ రాణిగారంటా ||త||

వచనం: రాజుగారు లేరా లేకేం వున్నారు
ఇంటిపట్టు సన్నాసి రాజని వారికి పేరండి ||తందాన||
శ్రీవారికి పేరండీ... తెలుసు కొండి.

వచనం:వంశం నిలిపే సంతతి లేదని చింత చెందరా వంత పొందినారా?
ఉన్నారా.....
అయ్యో ఆడపిల్లా అయ్యో ఇంటికి దీపం కొడుకే
కరువాయి....
ఆపండిరా ఉన్నాడు కొడుకు

ఉన్నాడరా భవనాల అతని మందిరం – సై
వదనమో అతిలోక సుందరం – సై
రమ్యమౌ రతనాల కంబళీ – భళా భళి
భవ్యమైనది పట్టె మంచము – భళా భళి
రెండిటి నడుమను – చూడుమూ భళా
యువరాజు ముఖ చంద్ర బింబము భళా.

వచనం: వరహాల రాజా ఇటు చూడమ్మా.
భళానో భాయి - భళా

వచనం: నీ కథ ఇంతకీ ఏమిటో రాజా రాణీ
కొడుకూ కోటా .... నౌకరూ చాకరూ... అన్నీ వున్నాయి.
కథకు కావలసిన కష్టాలు ఏమిటీ అని
చింతా కంత చింత లేనిదే కథ నడవదే
చింతా కంతేం ఖర్మ తాటే కంత వుంది... రాణిగారికి

డబ్బున్న వాళ్లంతా దొంలని.
లేని వాళ్లంతా దొంగలని గట్టి నమ్మకం.
ఉన్నవాళ్ల సర్వమూ - లేనివారు దోచుకుందురు
కమ్మని పువ్వుల తేనెను తుమ్మెద తాగి పోవును
ముద్దుగ పెంచిన చిలకనూ అమ్మో
గద్ద తన్నుకు పోవును
అదుపు పొదుపు లేని భర్తనూ ||తందానతాన||

అభము శుభము తెలియని కొడుకును. ||తందాన||
మాయ చేతురని మోసగింతురని
బందిఖానాలో పెట్టిందా.... అయ్యా ||తందానా||
పగడ బంధిఖానాలో పెట్టిందా
అయ్యా..... తందానా...... దేవనందనానా.....

★ ★ ★

# సీతారామ కళ్యాణం

శ్రీరామ కల్యాణ వైభోగమే
సీతా కల్యాణ సౌభాగ్యమే
శ్రీరస్తు శుభమస్తు
ఆనంద మానంద మాయెనే
మన రామయ్య పెళ్లికొడుకాయెనే
మన సీతమ్మ పెళ్లికూతురాయెనే
శోభానే శోభానే

పచ్చని పందిళ్లా భమిడీ లోగిళ్లా
ముంగిళ్ల ముత్యాల ముగ్గుల్ల శోభ
మాణిక్య దీపాల గాణిక్య క్రీడ
వీధుల్ల వినిపించు విమలగాంధర్వం
మిలమిలా మెరిసింది మిధిల
మించి రాణించే అయోధ్య
శోభానే శోభానే

ముల్లోక వాసులూ వియ్యాల వారూ
ఎదురు సన్నాహాల కేతెంచినారూ
ఊరేగి వచ్చింది ఊర్వశీ మేళం
మంత్రాలు చదివారు మహీసుర బృందం
పార్వతి దంచింది పసుపు
కొని తెచ్చె శారదా కుంకం

పన్నీటి జలకాల శాల
రమ్మంది లగ్నాల వేళ
రావయ్య రామయ్య వచ్చీ
రత్నాల పీటపై అమరూ
అంటాలి సంపెంగ తైలం – ఇది

అతిలోక మంగళ స్నానం
అంపినారు అత్తవారు ఘాగు – అందు
కలిపి నారు కన్నవారు పసుపు
మంచి గంధము జవ్వాది కస్తూరి పునుగు
మగువలందరు చేరి
నలుగు పెట్టారు
నీది అడవి పచ్చనాకు చాయ – అది
చేస్తాము పండుతమలపాకు రంగు
మేలు దవనం విరజాజి చామంతి బంతి
పూలసరములు
నీమేన వాసనలు జల్లు

సింగారించీ తీసుకు వచ్చీరీ – చెలికత్తెలు
సింగారించీ తీసుకు వచ్చీరీ
కుదురుగ నల్లని కురులను దువ్వీ
పువ్వుల వాల్జడ పొందుగ గుచ్చీ
సూర్యచంద్రులూ సొంపు నాగరం
పాపిడిబిళ్లను బాలకు పెట్టీ
సింగారించీ తీసుకు వచ్చీరీ

తీరుగ కస్తూరి తిలకము నద్దీ
కన్నుల కాటుక రేఖలు దిద్దీ
ముక్కున ముక్కెర చెక్కిలి చుక్కా
చెంప సరాలూ ఇంపుగ అమర్చి
సింగారించి తీసుకు వచ్చీరీ

అష్టలక్ష్ములూ తానైయున్నది
ఇష్ట భోగములు ఇక రామయ్యవి
పుస్తెలు పూసలు మట్టెలు పిల్లేళ్లు
ధరించబోయే ధన్యతకోసం
సింగారించీ సీతను తెచ్చీరీ!

హరి పాదముల పుట్టె
ఆకాశగంగ
ఆ గంగాజలముతో
ఆ పాదపద్మాలు

పెండ్లిపీటల మీద
వెండి పళ్లెమున
కడిగె కన్యాదాత
జనక మారాజు
ఇది నా కూతురు
సీత – శుభాంగి
ఇటు చేపట్టగ
నీ అర్ధాంగి
నిత్యము నీతో
నీడవిధాన
చరించ గలదని
చేతులు కలిపే
కళ్యాణము కన్నుల వైకుంఠం
శ్రీ సీతారాముల కల్యాణం
కాంచుటె కైవల్యం
తారలే ముత్యాల తలంబ్రాలు కాగా
అక్షింతలైనాయి నక్షత్రరాశి

ఎర్రని దోసిటా తెల్లని ముత్యాలు
సీత తలంబ్రాలకై తీసింది
తీసిన ముత్యాలు దోసిటి రంగుతో
ఇంపుగా కెంపులై పూచాయి
కెంపులనుకున్నవీ రామయ్య మై చాయ
సోకంగ నీలమ్ములైనాయి

ఇన్ని రంగులు గల దివ్య తలంబ్రాలు
ఇచ్చేను జనులకూ సర్వసౌఖ్యాలు

ఆది దంపతుల ఆ తలంబ్రాలు
అవని జనులకు కోటి దీవెనలు

కళ్యాణం కన్నుల వైకుంఠం
శ్రీ సీతారాముల కల్యాణం
కాంచుటె కైవల్యం

★ ★ ★

# శ్రీ సీతారాముల శృంగారం

తన చుట్టూ తమ్ముళ్లు
చెలిచుట్టూ చెల్లెళ్లు
చుట్టూరా పరివారం
ఎల్లా మరి శృంగారం
ఎవరైనా చూస్తారేమో
ఏమైనా అంటారేమో

సీతమ్మ నోములు శ్రీరాముని (ల) గోములు
కొత్తకొత్త కాపురాన మరుని కత్తిసాములు

దోరవయసు లేత మనసు తోడుదొంగలు
కవ్వించే ప్రణయాలు కడలి పొంగులు
ఆటకూటంలోన ఆడేను నెమలి
అత్తల్లమరుగున చిక్కుపడె రమణి

చిటికేస్తే చూడాలి ఇటుకేసే రావాలి
తెలిసిందా సంకేతం పొదరిల్లే ఏకాంతం
కలకలలు కిలకిలలు
పట్టుపడిన పకపకలు

సీతమ్మ చెల్లెళ్లు చిగురు మామిళ్లు
చిగురు మామిళ్లపై చిలిపి చిలకల్లు (పొగరు పిందెల్లు)
ఒప్పుల కుప్పలు వయ్యారి భామలు
చెలికత్తె లాడేరు చెమ్మచెక్కల్లు

కలికి నీ వాడితే గచ్చకాయల్లు
అందుకొన వస్తాడు అందాల వరుడు
తెల్లారె మగవాడి తెలివితేటల్లు
గొల్లుమని నవ్వారు కొంటె మరదళ్లు
సీతమ్మ నోములు శ్రీరాముల గోములు

ఊగవే ఉయ్యాల ఊర్మిళాదేవి
ఊగవే మీ అక్క నీకు సరిజోడి
వెండి మబ్బులు తాక వెలది సీతమ్మ

ఆ కాళ్లు కడిగేను ఆకాశగంగ
భూతలమ్మునుతాక సీతపాదాలు
పాదపూజలు చేయు పారిజాతాలు
ఇంతులాడే చోట ఇదియేమి వింత
నీలమేఘము చెంత హోయిగిలిగింత
సీతమ్మ నోములు శ్రీరాముల గోములు

వేడుకలు స్వప్నాలు విరగబూచాయి
కోరికలు పుష్పాలు కోయమన్నాయి
మనసుపడిన పువ్వు మంకెన్న పువ్వు
నెలత కోరిన పువ్వు నింగిలో నవ్వు
చేతి కందదు అల్ల చిటారుకొమ్మ
బడలి పోయిందమ్మ బంగారు బొమ్మ

'రాముడు సీతని
ఎత్తుకుని పువ్వు
అందించాడు'

ఊరీ ఊరని ఉవ్విళ్లు
కలిసీ కలవని కౌగిళ్లు
చేరీ చేరని చెక్కిళ్లు
కలబోస్తే
కాముని పరవళ్లు
ఉవ్విళ్లు
కౌగిళ్లు
పరవళ్లు

★ ★ ★

# శ్రీమత్ సుందరకాండ

గేయకథనం: శ్రీ ఆరుద్ర

వచనం: [సముద్రతీరం
మహాకాయుడు హనుమంతుడు
కొండమీద నించుని ఎగరడానికి
సిద్ధమైనాడు.]

కొండమీద పెద్దకొండ కండ పెంచెను
నిండు సాగరాన్ని దాట నిశ్చయించెను
బ్రహ్మవిష్ణు మహేశ్వరుల ప్రార్థించెను
పంచభూతములను ప్రస్తుతించెను

॥యథా రాఘవ నిర్ముక్తశ్శరశ్శ్వసన విక్రమః
గచ్ఛేత్తద్వద్గమిష్యామి లంకాం రావణ పాలితామ్॥

రామబాణం లాగ దూసుకుని పోతాను
రయమున గమ్యమ్ము చేరుకొంటాను
వేగాన్ని సడలించరాదు – దారిలో
విశ్రమించుట పనికిరాదు
స్వామి నామము నాకు సాయం – అదే
సాధించి పెడుతుంది విజయం

గుండెలను పూరించి కండలను బిగియించి
పాదమొక్కటి క్రిందమోపి
పర్వతమ్మును అణగద్రొక్క
భూదివమ్ములు దద్దరిల్ల
దిగ్గజమ్ములు గగ్గరిల్ల
చుక్కలన్నీ పిక్కటిల్ల
సూర్యచంద్రులు విస్తుపోవ
విష్ణుచక్రము లాగ జిష్ణు వజ్రములాగ
రామబాణము భాతి ధూమకేతువు రీతి
వాలము నింగిలో ఝళిపించి

వాతూల వేగాన్ని మించి
లంఘించె లంఘించె హనుమంతుడు
లవణాబ్ధి పైకెగిరె హనుమంతుడు

[మబ్బులమాటున
దేవతలు చూస్తున్నారు]

గండభేరుండమా! గరుడ సాళువమా!
చండమారుత ధ్వనుల నంది వాహనమా!
ఆకసమ్మున ఎగురుచున్నది
అరుణకాంతులు చిమ్ముతున్నది!

[హనుమ
దేవతల పక్కనుంచి
దూసుకుపోతున్నాడు]

పావు దూరము సాగె పవమానసుతుడు
దేవతలు, సాగరుడు తిలకించెరపుడు
పంతమ్ము ఎంతటిదో పరీక్షించగోరి
వింత విఘ్నమ్మును కల్పించినారు

[సముద్రం లోంచి రెక్కల
బంగరు పర్వతం లేచింది]

మార్గమధ్యములోన మైనాకుడు
ఆతిథ్యమిస్తాను ఆగమన్నాడు
హనుమ దేహమె రామబాణము
ఆగబోదిది దేనికోసము
ఆతిథ్యమె ఒక పెద్ద విఘ్నము
మైనాకుడా మన్నించి తొలగుము

[దేవతలు సంతోషించారు]

చెక్కు చెదరని దీక్ష మిక్కిలీ మెచ్చుకుని – ఇం
కొక్క పరీక్షగావించారు

[నాగమాత సురస భయంకర
రూపంతో పైకి లేచింది]

భక్షించగా వచ్చె రాక్షస రూపాన
రూక్ష దృక్కుల సురస దాక్షిణ్య రహిత

[కోరలతో కొండగుహలా
వున్న నోరు తెరచింది]

రారమ్మ రారమ్మ నా నోటికి
ఆహారమైనావు ఈనాటికి

**హనుమ:** స్వామి కార్యముపైన సాగిపోతున్నాను
మరలి వచ్చిన పిదప మాట్లాడుకొందాము

**సురస:** ఎవడైన నా నోట పడితీరుతాడని
ఏనాడో బ్రహ్మయ్య వరమిచ్చెనాకు
రారమ్మ రారమ్మ నా నోటికి
ఆహారమైనావు ఈనాటికి

[హనుమ వెంటనే దేహం
పెంచాడు. సురస అంతకన్నామేను పెంచింది
హనుమ హఠాత్తుగా సూక్ష్మరూపం దాల్చి నోటిలో
జొరబడి బయటకు వచ్చాడు]

**హనుమ:** మాటదక్కెను నీకు
నోట చిక్కాను
వెనువెంటనే వెలికి వచ్చాను
బ్రహ్మదేవుని వరము వమ్ముకాలేదు
రామకార్యమ్మింక సఫలమయ్యేను

[దేవతలు హనుమ తెలివికి
ఆశ్చర్యపోయారు]

అతని తెలివికి మెచ్చి ఆ నాగమాత
దివ్యరూపము దాల్చి దీవించి చనియె

మున్నావు దూరాన్ని మొనగాడు దాట
ముగిశాయి దేవతల పరీక్షలు
మొదలాయె రాక్షసుల దర్పాలు!

[హనుమ, తననేదో
అదృశ్యశక్తి కిందకు లాగుతున్నట్టు
గ్రహించాడు అది – నీడను పట్టుకుని
లాగి మింగేసే ఛాయాగ్రాహి అనే రాక్షసి!]

ప్రళయకాల కరాళ భయదాంధకారమై
ముంచుకొని వచ్చింది సింహిక – అది
మృత్యుదేవత అనల జిహ్వక
ప్రాణి నీడను లాగి ప్రాణాలు కబళించు
ప్రబల ఛాయాగ్రాహి నామిక!

[హనుమ కాళ్లు విదలించుకుని, తోకపెంచి
దాని గొంతుచుట్టి గిరగిర తిప్పి కొట్టి చంపాడు]

ఆ రామయ్య కృపచేత అడ్డంకులన్నీ
తీరగా తీరమ్ము చేరాడు
అట త్రికూటాద్రిపై నిలచాడు

[కోట బురుజులపై
ఆయుధపాణులైన అసురుల చూశాడు]

లంకలో రాక్షసులు శంకించకుండా
కొండంత రూపాన్ని కుదియించుకున్నాడు
పిల్లిలా అడుగులు మెల్లగా వేస్తూ
వెనుకోట వాకిళ్లు చేరాడు

[హనుమ చిన్నకోతిరూపం
దాల్చాడు. చంద్రోదయం అయింది
లంకిణి ఉగ్రరూపంతో అడ్డుకుంది]

ఆగుమాగు మర్కట ఆగరా కోతిగా
పురుగునైనా లోన చొరగనీను
లంకిణియగు నేను లంకాధిదేవతై
కాచుచుంటి కోటి కనులతోడ

[హనుమ లంకిణిని నానా
అవస్థలూ పెట్టి చివరకి ఉగ్రరూపం
దాల్చి ఒక్క పిడిగుద్దుతో దాన్ని
నేల కూల్చాడు]

లంకిణి: హమ్మో్మ!
కోతిపిల్లవు కావు కావు
కోరి వచ్చిన రుద్రుడీవు
చేతిదెబ్బతో కూల్చినావు
పాతగాధను తెల్పినావు
లంకిణిని పడగొట్టువాడె
లంకకెంతో చేటు తెచ్చు
ఇది నున్న బ్రహ్మయ్య శాపం
ఇప్పుడది దాల్చింది రూపం
వెళ్లులోనికి నీవువెళ్లు
విజయమ్ముతో పిదప మళ్లు

[దారిచూపి మాయమైంది
హనుమ తల అడ్డంగా ఊపి]

పాడిగాదు చేర పగవాని మొగసాల
సూటిగాను గడపదాటరాదు

[మహాకాయంతో వున్న
హనుమ, ప్రాకారం ఒక్క అంగతో
దాటి ఎడమకాలు కిందకి మోపుతూనే
రూపం కుదించేశాడు]

పవన పుత్రుడెగిరి ప్రాకారమును దాటి
ఎడమకాలు మోపి అడుగు బెట్టె

[దేవతలు మెచ్చుకున్నారు
స్వర్ణలంకలో వీధులు వాడల్లో
హనుమ వెతకడం మొదలెట్టాడు]

తోటలు తోపులు చూశాడు
దొడ్డవనముల సంచరించాడు
వీధులూ వాడలూ వెతికాడు
మేడలు మిద్దెలు తిరిగాడు
ఇల్లిల్లు తప్పక వెతికాడు
ఇందువదనల మోము చూశాడు

రావణ భవనం చేరాడు
రాణి వాసాలు వెతికాడు

[వివిధ భంగిమల్లో
మైమరచి నిదురిస్తున్న ఆడవాళ్లు]

రాజప్రసాదమ్ములో రాత్రంత తిరిగాడు
రాజీవలోచనల రవరవలు చూశాడు
మద్యపానము చేసి మదన కదనము చేసి
మైమరచి నిదురించు మదవతుల చూశాడు
నృత్యగానమ్ములే. నిత్యకృత్యమ్ముగా
నినదించి ఒరిగిన. నెలతలను చూశాడు

[జారిన బట్టలు...
నాభీ ప్రదేశాలు ఉత్తుంగ వక్షోజాలు...
ఒకరి తొడమీద ఒకరు మైమరిచి...]

వీణలూ వేణువులు వివిధ వాద్యాలు
హత్తుకుని శయనించు మత్తులను చూశాడు

[పడకటిల్లు ప్రవేశించాడు
పెద్ద పందిరి పట్టె మంచం]

పడకటింట్లో పెద్ద పట్టె మంచంమీద
రాజిల్లి నిదురించు రావణుని చూశాడు

[రావణుని పక్కనే పడుకున్న అతిలోకసుందరి
ఒకతెను తేరిపార చూశాడు]

సురవైరి శయ్యపై సుదతి తానెవ్వరు?
శుభ లక్షణములు చూడ సీతె! ఇంకెవ్వరు!

[హనుమకి పట్టరాని
సంతోషం కలిగింది. ఆనందంతో అరవబోయి
వెంటనే నోరు మూసుకుని
బయటకు పరిగెట్టుకెళ్లి - సంతోషం
ఆపుకోలేక జబ్బలు చరుచుకున్నాడు
తోకను ముద్దుపెట్టుకున్నాడు.

స్తంభాల పైకెక్కి నేలకు దూకుతూ రకరకాల
కోతి చేష్టలు చేశాడు]

**హనుమ:** చూశాను! చూశాను! సుగుణాల రాశిని
చూశాను రామయ్య పత్నిని!

[గోడమీద తన నీడే
పెద్దది కనిపించింది]

**నీడ:** యాడరా? యాడరా? యాడ?

**హనుమ:** చూడరా ఆ శయ్య మీద!

[అదేక్షణాన
శయ్యమీద మండోదరి
నిద్రలోనే భర్తపై చేయివేసింది
హనుమ అదిరిపడ్డాడు]

॥న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హతి భామినీ
నభోక్తుం నాస్యలం కర్తుం నపాన ముపసేవితమ్॥

**నీడ:** పరమ పతివ్రత సీతమ్మ
పరుని పర్యంకాన పవళించునా!
చేశావు సాధ్వికి అపకృతి
లేదురా నీకెంక నిష్కృతి
ఒరీ వివేక భ్రష్టుడా
రారాని ఊహల దుష్టుడా
ఉన్నదా బుద్ధి ఉన్నాదా?
ఉన్నచో అది గడ్డి తిన్నదా!
చదివినావే సర్వ విద్యలూ
వివేకములేక అవి మిథ్యలు

[హనుమ కంటనీరు తిరిగింది
లెంపలు వేసుకున్నాడు చెవులు మూసుకున్నాడు
నెత్తికొట్టుకున్నాడు అక్కడనించి పరుగున బయటకొచ్చాడు
సముద్రపొడ్డున చతికిలబడి తలపట్టుకుని శోకించాడు]

ఇంతపాపపు తలపు కలిగిన పిదప
బలమేల తెలివేల బ్రతుకు టికనేల

[మఠం వేసుకుని ఊపిరి బంధించాడు:]

రాం రాం రాం రాం రాం రాం రాం రాం
ప్రభువును స్మరణమ్ము గావించగానే
ప్రజ్ఞ తనలో తాను ప్రజ్వరిల్లిందీ.

[ఆలోచించసాగాడు]

రమణి కనబడకున్న రామయ్య ప్రాణాలు నిలచేనా!
లక్ష్మన్న పిమ్మట బ్రతికేనా!
భరతశత్రుఘ్నులు భరియించగలరా!
ఇక్ష్వాకు వంశమే ఇలనుండగలదా!
ఇందరికి ఇడుములు కలిగించునపుడు
విఘ్నాలు వాటేల్ల వెత చెందరాదు
ధైర్యాన్ని విడనాడి తలవంచరాదు

[మెల్లగా లేచాడు
ముఖం వికసించింది]

క్షీరాబ్ధి చిలికేటి కోలాహలంలో
ఆదిలో వచ్చింది హాలాహలం
అది చూడ చాలా భీతావహం
మానినారా దీక్ష మహనీయులు!
పొందలేదా తుదకు మధురామృతం!
యత్నించ సిద్ధించు ఫలితం
సాగాలి సాగాలి సంశోధన
సత్ఫలిత మందాలి ఈ సాధన
వనవాస దీక్షలో వసివాడు తల్లిని - వెళ్లి
వనసీమలోనే వెతుక వలయు

[చల్లగాలి వీచింది
దూరాన కొమ్మలకు కట్టేన చిరుగంటల సవ్వడి
హనుమ అటుతిరిగి నమస్కరించాడు]

అష్టదిక్పాలకులకు ఇష్టదేవతలకు
సాష్టాంగప్రణామాలు సాఫల్యసిద్ధికి
లక్ష్మణ సమేతుడౌ రామునకు వందనం
లలితాంగి సీతమ్మ తలపులకు వందనం

[హనుమ అశోకవనం
ప్రవేశించాడు గాలికి ఆకులు కొమ్మల చివర వేలాడుతున్న
చిరుగంటలు అల్లాడుతున్నాయి చెట్ల నుంచి పూలు హనుమమీద
పూలవాన కురిశాయి. అంతా శుభసూచకమే!]

చిరు చిరు గంటలు గలగలమంటే
విరిసిన పువ్వులు పరిమళించితే
కొమ్మల రెమ్మల కోకిల గానం
ఝుమ్మని మ్రోగే తుమ్మెదనాదం
అవనికి దిగెనా నందనవనము
ఆహా! అశోకవనము
సీతకు మాత్రం శోకవనం, శోకవనం, శోకవనం

నేరేళ్ల మారేళ్ల నిమ్మలా నీడలా
ఆరామ సీమలో ఆ రాత్రిపూట
అపరంజి చాయల శింశుపావృక్షాన్ని
హనుమయ్య చూశాడు అది ఎక్కినాడు
గుబురు టాకుల మధ్య గుట్టుగా కూచుని
దశదిశలు పరికించె నిశితమ్ముగాను

[అశోక వనశోభ సమీక్షించాడు
రాక్షసస్త్రీల గుంపు – వారి మధ్య బెదిరిన లేడిలా
ఒక దీనురాలిని చూశాడు]

క్రూర రాక్షస స్త్రీల గుంపు పరికించాడు
గుంపులో వెలిగేటి గుణవతిని చూశాడు

శుక్లపాడ్యమి చంద్రరేఖ
శుష్కించె శ్రీదీపకళిక
మాసిన చీరలో రమణి
మూసిన ముత్యమ్ము కరణి

నక్కలూ తోడేళ్ల నడుమ
దిక్కుతోచని లేడి కొదమ
ప్రతిదినము పడతికి ఏకాదశి
ప్రతిరాత్రి అతివకు శివరాతిరి
ప్రాణాలు తప్పించి సర్వమూ త్యజియించి
పతిరాకకై తపము చేయుచున్నది సతి

[అంతలో కోలాహలంగా
వాద్యాలు నగారాలు – రావణుడు
సపరివారంగా రాణులతో వస్తున్నాడు]

రాత్రి కడపటి ఝాము లోగా
రావణుడు మేల్కాంచె బాగా
రమణి సీతను కాంచువరకు
పొద్దుపొడవదు ఆ కాముకునకు

[రావణుడు సీత ఎదుట
నించున్నాడు. ఆవిడ వణికిపోయింది]

**రావణ:** వెళ్లిపోయే నీరు వెనుకకు రాదే సీతా!
కరిగిపోయే వయసు తిరిగి రాబోదే సీతా!
కటిక నేలపైన పడకేమిటే!
కటకటా ఈ నార చీరేమిటే
ప్రతిపూట పస్తుల వ్రతమేమిటే!
కుదురుగా దువ్వని కురులేమిటే సీతా!
అడవి వెన్నెల కారాదు అందాలు
పుడమిలో గొప్పవే నారాచభోగాలు
మారుమనువు మనకు నేరమ్ముగాదే
మహారాణి పదవుల విహరించవే
పదినెలలుగా నీకు పడిగాపు అయినాను
పదినోళ్లు పెట్టుకుని ప్రార్థించుచున్నాను
మనసుపడి నను మన్నించుదాక
మానినీ తాకనని మాటిచ్చినానే
బెదరకే బెదరకే

[సీతమ్మ ఒక గడ్డిపోచ
తీసుకుని దానినే చూస్తోంది
రావణుడు ముందుకు రాబోయాడు
సీతమ్మ కళ్ళెర్రజేసి బుసకొట్టింది. రావణుడు ఆగాడు
సీతమ్మ గడ్డిపోచనే చూస్తూ]

**సీత:** ఉత్తమ ఇల్లాలి ఉసురు
మృత్యుదేవత విసురుగొలుసు
పాపాత్మునకు ముక్తి ప్రాప్తించనట్లు
నీచుడా నీ చేతి కందదీ భూజాత
రామబాణము నిన్ను కడతేర్చులోగా
రక్షించుకో నీ ప్రాణ పంచకము

[హనుమ మెచ్చుకున్నాడు]

రావణ: ఆఁయ్! చాలించు నీ శాపనార్థాలు
రావులే నాకే అనర్థాలు
గడువు ఇస్తున్నా రెండు పున్నములు
ఆలోగా కావాలి నీవు నా ఆలు

[రావణుడు ఒక అడుగు
వెనక్కేసి రాక్షసస్త్రీలను చూసి]

చుట్టూ చేరిన దనుజ స్త్రీలు
పెట్టమనె హింసలను చాల
హడల కొట్టి వెడలినాడు
అంతట పదితలలవాడు – రావణుడూ–

[రావణుడు వెళ్లాడు]
కాపలా వున్న రాక్షస స్త్రీలు సీత
చుట్టూ చేరి వికట నృత్యం]

సృక్కు సృక్కు అస్సృక్కు
నాతిరో విను నాతిరో
రావణబ్రహ్మకు రాణివైతే
దండం పెడతాం దండలు వేస్తాం
నరమాంసం తిని శాన్నాళ్లాయెను

నరుక్కు తింటామే నిన్ను
కొరుక్కు తింటామే
కండలుకోసీ ఉండలు చేసీ
కణకణ కణమను నిప్పుల మీదా
కాల్చుకు తింటామే
సల సల సల సల మరిగే చమురులో
వేపుకు తింటామే
వండుకు తింటామే
పండగ చేస్తామే!

[సీత భయం – హనుమ కలగ
జేసుకోబోయి కంగారు – ఏమీ తోచదు]

నికుంభిలా నికుంభిలా జై నికుంభిలా
జాజిరి జాజిరి నికుంభిలా
రావణ బ్రహ్మకు రాణివైతే
దండం పెడతామే – మెడలో
దండలు వేస్తామే
పండగ చేస్తామే!

[తిన్నెకు ఆవల త్రిజట అనే యువతి సీత బెదురు
చూసింది. ఊహ తోచి పక్కనే పెద్ద ముక్కాలి పీట
మీదున్న కల్ల బానను ఒక్క తోపు తోసింది
కాపలాస్త్రీలు పాట ఆట ఆపి అదిరిపడిచూశారు
త్రిజట జుట్టు విరబోసుకుని భయం నటిస్తూ]

**త్రిజట:** కలకలకల కల పీడకల! పాడుకల!
తెల్లారుజాము కల! కల కల కల కల
అల్లకల్లోలమైనట్టి కల! కల కల కల కల

[రాక్షస స్త్రీలు కుతూహలంగా
అటునడిచారు (రహస్యం చెబుతున్నట్లు)]

నల్లా నల్లాని నరుడు
విల్లూ నెక్కుబెట్టి
భగ్గూ భగ్గూవ మండు

బాణమేసి కొట్టినాడు – ఆ
భగ్గుమనే మంటల్లో
భస్మమాయె లంకంతా
ఆ బూడిద కుప్పల్లో
తలా గంటివే

[అంత భయంగా
చూశారు]

రాజు తలలు గంటివే పది తలలు గంటివే
అయ్యో ఇటులా కలాగంటివే
నేనూ త్రిజటానూ కలా గంటివే
నల్లాని ఆనరుడూ చల్లంగా నవ్వుచూ
రమణీ సీతను చేరి రాణీ రమ్మ్న నేనే
కాబోవు రాణిని గమనించరే
కడు భయభక్తుల సేవించరే – ఓయమ్మ ఒహోయమ్మ

[అంతా భయంగా సీతవైపు
చూసి – వెనక్కి వెనక్కి తగ్గిదూరంగా జరిగారు]

గుబురుటాకుల మరుగునించి
వీక్షించె హనుమయ్య పొంచి
ఆరాటపడుతున్న సాధ్వికి
ఏ రీతి కలిగేను ఊరట
ఏ విధముగా కలుసుకొనుట!
నాతి వున్నట్టుండి కోతిరూపునుచూసి
భీతిల్లునో లేక శంకించునో!
పడరాదు పడరాదు తొందర
పడతి శాంతించాలి ముందర!

[వణికి పోతూ వెక్కి వెక్కి
ఏడుస్తూన్న సీతమ్మ అతిప్రయత్నం మీద
తనను తాను సముదాయించుకుని]

తనలో తానుగా మధన పడ సాగింది
దారి తోచని తరుణి సీతమ్మ

చూడచుట్టము నేడులేడు
మ్రొక్కు దైవము కానరాడు
దినదిన గండమ్ము దెయ్యాలతో పోరు
చెరలోన జీవితం దుర్భరం
ఉరిపోసుకొనుటే ఉత్తమం
తడబడక నిలిచింది సీతమ్మ
జడమెడకు చుట్టుకొనె ఆయమ్మ

[సీత చెట్టుకొమ్మను ఓ చేత్తో పట్టుకుని
జడమెడకు చుట్టుకుంది – హనుమ
దిగ్భ్రాంతి చెంది అప్రయత్నంగా రెండు చేతులతో
వారిస్తూ రామనామం ఉచ్చరించాడు]

**హనుమ:** రామా! రామా! రామా! రామా!

[సీత చురుక్కున పైకి చూసింది – పిల్లకోతి! ముద్దొచ్చేలా చిందేస్తోంది!]

**హనుమ:** కౌసల్యా వర నందన రామా!
దశరథ హృదయానందన రామా!
దినమణి కుల సందీపక రామా!
మునిగణ ఘోషణ తోషిత రామా!
తాటకాది విధ్వంసక రామా!
తపసియాగ సంరక్షక రామా!
రాతిని నాతిగ చేసిన రామా!
పాతకములు హరియించే రామా!
ఖండిత ధూర్జటి కార్ముక రామా!
జనక నందినీ ధవ జయరామా!
జయజయ రామా జానకి రామా!
జయ రఘురామా సీతారామా!

పిల్లకోతి ముద్దుగా చిందు
వేస్తానే పాడుతూ
చెట్టుమీంచి దూకింది
రామనామానికి సీత ఒళ్లు
మరచిపోయింది. కురులు
చేతినుండి జారిపడాయి.

పిల్లకోతి రామరామ అంటూ సీతచుట్టూ
నాట్యం తిరిగాడు, అంతలో సీత
అనుమానపడింది. హనుమగమనించి
ఆగి నమస్కరించాడు.

[అమిత దుఃఖంతో] – సీత: ఎవరయ్య ఎవరయ్య నీవు – నీ
వివరాలు ముందుగా చెప్పు
[ఏడుపుముంచుకురాగా] – మారువేషము వేసి మాయ పాటలు పాడి
మరుమోసము చేయ
దాపురించావా అధముడా ఓ అధముడా

హనుమ చెవులు
మూసుకుని కాదని తలూపుతూ

**హనుమా:** కాదమ్మ కాదమ్మ తల్లీ
నాది నిజరూపమే తల్లీ
రామ పత్నివి – లోక మాతా సీతా – ఈ
హనుమ అణువణువునా రామదూత
రాముడంపగ వచ్చినాను – నీ
[ముద్రిక తీసి] క్షేమమతనికి తెలుపుతాను
ముద్రికను ఇచ్చాడు స్వామి – ఇది
భద్రముగ పుచ్చుకోదేవి

[సీత ఆనందబాష్పాలు]
కడలి దాటినాను కాలువరీతిగా
తనువు పెంచి మరుదాటగలను
వీపుపైన నీవు విశ్రమించుము తల్లి
చేర్చగలను స్వామిచెంత నిన్ను

**సీత:** రూపుచూస్తే అత్యల్పము
మాటలేమో ప్రగల్భము
నూరు ఆమడల దూరము చిన్న
వానరము దాటుట విడ్డూరము!

**హనుమ:** చిన్న కోతియనుచు చింతయే వలదమ్మ
తలచుకొన్న పెంచగలనుమేను (మీ దీవెనుంటేను)

[కళ్లు మూసుకుని ధ్యానించాడు
ఆకాశమంత పెరగడ మారంభించాడు
దేవతలు పరికిస్తున్నారు.
పంచముఖాలు దేదీప్యమానంగా వెలిశాయి]

॥ వందే వానర నారసింహఖగరాట్ క్రోడాశ్వ వక్త్రాంచితమ్
నానాలంకరణ త్రిసంచనయనమ్ దేదీప్యమానం రుచా
హస్తాబ్జైః అసి ఖేట పుస్తకసుదా కుంభం కుశాద్రిం హలం
ఖట్వాంగం ఫణి భూరుహం దశభుజం సర్వారి గర్వాపహం ॥

[హనుమ రూపం తగ్గించి
చేతులు కట్టుకుని నించున్నాడు]

**సీత:** కంటినయ్యా రామబంటు బలము
మేను పెంచి పెంచి మించావు మింటిని
రాముని చూచుటకైనా రాలేను నీ తోడ
కారణమ్ము కలదు హనుమ వినుమ
దొంగిలించి నన్ను తుచ్ఛుడు తెచ్చాడు
తనకు లేని నీతి మనకు గలదు
సంగరాన రిపుల చంపి నానాథుడే
నాచెర విడిపింప న్యాయమగును
కారణమ్ము ఇదియె హనుమ వినుమ

**హనుమ:** సందేహం తీరెను తల్లీ
సందేశం వుందా తల్లీ!

[హనుమ బుద్ధిగా మఠం వేసుకుని
చేతులు కట్టుకుని కూచుని వింటూంటే
సీతమ్మ విషయాలు చెప్పింది]

పతికి సందేశమ్ము పంపుతూ కొన్ని
సంగతులు గుట్టుగా చెప్పింది
సతిపతుల మధ్యనే జరిగిన రహస్యాలు
లజ్జవీడీ లలన చెప్పింది
కాకాసురుడు నాడు చీకాకు పరచిన
గాథ వివరంగా తెలిపింది

కాకివంటి అల్పప్రాణిపైనే అలిగి
లోక భీకరమైన బ్రహ్మాస్త్రమే వేసెనే
రాక్షసుడు చెరబట్ట రణభేరి వేయించి
రాముడెందుకు రాడు నేడూ
ఆడరాని మాటలాడాను మరదిని
ఆ దోషమే తగిలె నిట్లూ
పడరాని కష్టాలు పడుతున్న సతిని
విడిపింపనాథునీ రమ్మనుమా
రమ్మనుమ రమ్మనుమ హనుమ!

[చూడామణి తీసింది:]

ఆరోప్రాణము రీతిగ
కూరిమితో దాచుకున్న గుర్తును అపుడా
నారీమణి చూడామణి
శ్రీరాముని మేటిబంటు చేతికొసంగెన్

[హనుమ చూడామణిని కళ్లకద్దుకుని భద్రంగా దాచుకున్నాడు]

ఆనవాలును తీసుకున్నాడు
ప్రాణప్రదముగ దాచుకున్నాడు
వెళ్లివచ్చెదనమ్మ వెళ్లివచ్చెదను
వేవేగ పయనింతు సెలవీయవమ్మ!

**సీత:** అప్పుడే పయనమా ఆపద్బాంధవా
ఆగవయ్యా నీవు ఒక్కింత సేపు
చెవులార విందును శ్రీరామ వైనాలు
చెప్పవయ్యా నీవు మరల మరల
దినదిన గండమ్ము దెయ్యాలతో పోరు
దినమైన తప్పించవయ్యా – ఒక్క
క్షణమైన మరిపించవయ్యా

[హనుమ తిరిగి కూచున్నాడు:]

దీనాతిదీనముగ ఆ నాతి వేడుకొన
తానాగె ఆ రామదూత

చెప్పినా వైనాలె మరల మరలా చెప్పి
తగ్గించె దుఃఖమ్ము కొంత, సీతమ్మ దుఃఖమ్ము కొంత!

[మోకరిల్లి]

**హనుమ:** తల్లిరో నేవచ్చి తడవాయెనమ్మ
వెళ్ళి నాస్వామికి నీ వార్త చెప్పాలి
వేవేగ పయనమ్ము కావాలి
పరగడుపు పయనమ్ము
కడు డస్సిపోవచ్చు
పండు ఒక్కటి నాకు సెలవీయవమ్మ

సీత గతుక్కుమంది

ఆకొన్న బిడ్డకు ఆహారమీయని (ఆహార మీలేని)
అమ్మ బ్రతుకే నాదు బ్రతుకు
కొమ్మ కొమ్మకు కోటి రాక్షసులున్నారు
కోసుకో చూసుకో అదను
బాపుకో బాపుకో క్షుధను

[హనుమ ఎగిరి గంతేశాడు
ఆకాశంలో దేవతలు నివ్వెరబోయారు]

బాల్యమందున ఇతడు భానుబింబముచూసి
పండనీ భ్రమియించినాడు
ఆవురావురనుచు ఆకలికి తాళక
ఆ పండును భక్షించ ఆకసానికి ఎగిరి
సూ  కబళించ చూసె – సృష్టినే స్తంభింపజేసె
ఇప్పుడీ ఆకలికి ఏ పండు మింగునో
ఏమి పరిణామమో చెప్పగలడా దేవుడైన!

అంజనా తనయుడూ ఆజానుబాహుడూ
అపుడు విజృంభించెను
నిమ్మపండ్లూ దబ్బ దానిమ్మ పండ్లూ
కండ చక్కెర ఫలములూ

పగవాని తోటలో పండొక్కటైననూ
భక్షించ యోగ్యమ్ము కాదాయె!

[హనుమ పళ్ళను కొరికి
పారేస్తున్నాడు – ఉమ్ముతున్నాడు.]

పళ్లన్ని రాల్చి
కొమ్మల్లు విరిచి
చెట్లన్ని కూల్చి గర్జించె
అటనున్న భటుల
పిడికిళ్ళ గొట్టి
తోకతో చుట్టి క్రీడించె
తన రాక తనగొప్ప తనస్వామి బలిమి
దనుజాధమునికి చాటదలచాడు
అదను కోసము వేచియున్నాడు

**[రావణ సభలో]** వన వినాశము వార్త విన్నాడు
అదరి పడి లేచాడు రావణుడు
వానరుని తక్షణము వధియించమన్నాడు

**[హనుమగర్జన]** వచ్చిన సేనను పచ్చడి సేయగ
వడివడిగ తనమేను పెంచాడు
లీలావతారమ్ము దాల్చాడు
కాలాంతకుని లాగ తోచాడు
తోకతోకొట్టి
రాళ్ళతో కొట్టి
కాళ్లతో తన్ని
గోళ్లతో చీల్చి
కండలు కోశాడు
కొండంత కుప్పలు పోశాడు
జగజ్జెట్టీని జంబుమాలినీ
విరూపాక్ష రూపాక్ష యోధులను
ముష్టిఘాతముల రక్తము కక్కగ
కొట్టి చంపినాడు
తొడగొట్టి అర్చినాడు
రావణ పుత్రుడు అక్షకుమారుని

కాళ్లను పట్టి గిరగిర తిప్పి
నేలకూల్చినాడు

[రావణ సభ:]

చిన్నకొడుకు మృతిని విన్న రావణుడు
ఖిన్నుడై శోకించె క్రుద్ధుడై గర్జించె

[ఇంద్రజిత్ వచ్చి నమస్కరించాడు]

ఇంద్రజిత్తును మెచ్చి యుద్ధాని కంపించి
పేరు నిలబెట్టమని చెప్పాడు

[ఆకాశంలో దేవతలతోబాటు
నారదుడూ చూస్తుండగా
రథం మీద ఇంద్రజిత్ వచ్చాడు
హనుమ తోకతో అదలించగా గుర్రాలు
బెదిరి పారిపోయాయి. రథం కూలి ముక్కలయింది
ఇంద్రజిత్ పాదచారిగా నిలబడ్డాడు]

వాయుబాణము లేసె దానవుడు
గొప్ప అస్త్రము కాస్త చప్పబడియె

నారద: వాయుపుత్రుడు కదా హనుమంతుడు
ఆయురారోగ్యాల దృఢచిత్తుడు
అగ్నిబాణము వేసె ఆ అసురుడు
ఆ లెస్స అస్త్రము తుస్సుమనియె

నారద: అగ్నిమిత్రుని కొడుకు హనుమంతుడు
అగ్నిజ్వాలల మించు భాస్వంతుడు

రుద్రబాణము వేసె రోసగాడు
మేటి అస్త్రము ధాటితప్పె

నారద: రుద్రాంశతో పుట్టె హనుమంతుడూ - కైలా
సాద్రి గంభీరుడా బలవంతుడు

[నవ్వుతూ] - హనుమ: రామయ్య మాటకు
బ్రహ్మయ్య కోలకు

కట్టుబడతా నేను ఎల్లకాలం
కలనైన ఇలనైన నన్ను
బంధించ జాల దే అస్త్రజాలం!

[ఇంద్రజిత్ బ్రహ్మాస్త్రం వేశాడు]

**ఇంద్ర:** నమో బ్రహ్మదేవా!
నమో పితామహా!

[హనుమ రూపు
కుదించి కళ్లుమూసుకుని
నమస్కరించాడు.
బంధించింది]

పరులనైతే చంపు అస్త్రము
పవన పుత్రుడు కనుక మన్నించెను
పాశమై గట్టిగా బంధించెను

[రాక్షసులు హడావుడిగా
వచ్చి ఇనుపగొలుసులతో
హనుమను కట్టేశారు]

ఏనూరు జంఝణల ఇనుప గొలుసులు వేసి
కట్టేరా అవివేకులు

**నారద:** ఇతర బంధములు ఇసుమంత తాకితే
సడలిపోవును గొప్ప బ్రహ్మాస్త్రము!

[ఇంద్రజిత్ మండిపడ్డాడు
హనుమ నవ్వుకున్నాడు]

**హనుమ:** నీ తండ్రి సన్నిధిని నీ గొప్పచాటుకో
తీర్చుకోరా ముచ్చట – నన్ను
ఠీవిగా నిలపరా అచ్చట

[హనుమను కింకరులు
రావణ సభకు లాక్కెళ్లారు
హనుమ రావణుడు
ఒకరి నొకరు చూసుకున్నారు]

ఒకరినొకరు చూసుకొనిరి
ఒక్కింత మదిని మెచ్చుకొనిరి

**రావణ:** కైలాసగిరిని మున్ను కదిలించు సమయాన
నన్ను శపియించిన నందీశుడా వీడు!

**హనుమ:** రావణా! శత్రు గర్వ విద్రావణా
సకల లోకైక భీషణా
సంగ్రామ వికట భాషణా
వేదవేదాంగ ధర్మా సధర్మ సుజ్ఞాన
సూర్య భూషణా శుభలక్షణా
కామమోహిత దశకంఠా – శుంఠా
పెక్కువరముల సంపద ఒక్క
పాపముతో బూడిద!
పరస్త్రీ హరణము నీప్రాణ హరణము!

**రావణ:** ఆఁయ్! ఎవడురా నీవు – ఎవడు నీ ప్రభువు?
ఎందుకని వచ్చావు ముందు వివరించు

**హనుమ:** రామదూతను నేను రాయబారిని నేను
రాచకార్యముపై వచ్చినాను
వచ్చిన దూతకు ఉచితాసనం
ఇచ్చుటేకద రాజనీతి

**రావణ:** అడుగువాడవు నీవు బడుగువాడవు నీవు
భద్రపీఠము నీకు తగదు
కట్టుతాళ్లే నీకు చాలు– చేతులు
కట్టుకుని నిలవరా మేలు! అదే నీకు చాలు!

[హనుమ సంకెళ్లు
తెంచుకున్నాడు]

కన్నెర్ర జేశాడు హనుమయ్య
కట్టుతాళ్లను తెంచుకున్నాడు
తోడనే తన తోక పెంచాడు
ఏడునిలువుల పీఠమెత్తుగా కట్టాడు

[తోక సింహాసనము మీదికి
ఎగిరి కూర్చుని]

హనుమ: బడుగు వాడిపుడెవడు? అడుగు వాడిపుడెవడు?
తేడాలు తెలుసుకో వేగ!

రావణ: ఇంద్రజాలము నేర్చినావా కోతిగా
ఇది క్రీడలకు వేళకాదు
జాతి బుద్ధులు వీడరా!

హనుమ: కోతియా! ఔను! కోతియే!
కుప్పి గంతులో
గొప్ప సముద్రము
దాటి వచ్చినది కోతిరా!
ఒక్క దెబ్బతో
రక్కసి లంకిణి
తుక్కుచేసినది కోతిరా!
లక్ష రాక్షసుల
అక్ష కుమారుల
శిక్షించినదీ కోతిరా!
ఒక్క కోతికీ
శక్తి నిచ్చినది
రామపాద రజమ్మురా!
నన్ను మించిన కోటికోతులు
కాచియున్నవి తెలియరా!
రామబాణము వచ్చులోపల
రామ శరణము కోరరా
శ్రీరామనామము శాయరా!
రామ రామ రఘురామ పరాత్పర
రాక్షస సంహార రణధీరా

[సభంతా భజన చేసింది
తన్మయత్వంతో
వూగిపోయింది]

రథాంగధర ఘన సతంగ వాహన
రమారమణ నారాయణా
రామరామ రామరామ

[అశోకవనంలో సీతమ్మ
కంట ఆనందబాష్పాలు!]

రామసీతారాం!
రామరామరాం!

[రావణాసురుడు సైతం రామనామ
స్మరణ మహిమను తప్పించుకొనలేకపోయాడు
అంతలోనే తెప్పరిల్లి]

**రావణ:** అఁయ్! సంకీర్తనము కట్టిపెట్టు
సందేశ మున్నచో మొదలుపెట్టు

[**ఉపదేశ ముద్రతో**] **హనుమ:** వద్దురా యుద్ధమ్ము వద్దురా—
సీతమ్మ నర్పించుకో
బుద్ధిగా అర్పించుకోరా
వీరాధి వీరుడు ఆ రామచంద్రుడు
వింటనారిని సారించునాడు
లంకలో మగవాళ్ల ప్రాణాలు పోతాయి
లలనలందరి తాళ్లు తెగుతాయి
దుంపనాశన మవకు రావణా!
దుష్టబుద్ధులు వీడరా!

విన్నపలుకులు ములుకులాయె
కన్నులిరువది కొలిములాయె!
వధియించమన్నాడు వానరాన్ని

[అంతా కత్తులు దూశారు]

వలదని వారించినాడు
సుగుణ భూషణుడా విభీషణుడు

**విభీష:** దూతను చంపుట భువిలో
పాతకమని శాస్త్రవిదులు పలికిరి కాదా!
కోతికి తోకే ప్రాణము
ఆ తోకను కాల్చవయ్య అంతే చాలున్!

[రావణుడు సభని కలయ చూశాడు]

**అంతా:** అవునూ!
ఆ తోకను కాల్చవయ్య
అంతే చాలున్!

విలువలెన్నో చింపిరి – దానవులు
చమురు కుండలు తెచ్చిరి
పీలికలను తడిపి ఆ వాలమ్మునకు చుట్ట
వనచరుడు తా నవ్వేను
వాలాన్ని తెగ పెంచెను.
శాలువలు ధోవతులు చేలమ్ములను చింప
వాలమ్మునకు చాలవాయె!
రాణివాసములోని రమణుల వస్త్రాలు కూడ
వాలమ్మునకు చాలవాయె
తెమ్మని తేతెమ్మని – ఇంకా
సీత చీరకూడా శీఘ్రముగా తెమ్మని
ఆనతిచ్చుట వినిన హనుమయ్య
అదిరిపడి చూశాడు హనుమయ్య
తన తోక ముడిచాడు హనుమయ్య

కణకణామండేటి కాగడా మంటలతో
భగభగా హనుమ తోకను మండించినారు

వనములో సీతమ్మకీ వార్త తెలిసింది
మనసులో హనుమకై ఎంతో వగచింది
అగ్నిభట్టారకుని ప్రార్థించినాది,
హాని చేయకుమనుచు అర్థించినాది
ఆ తల్లి ప్రార్థనే హనుమయ్య బలము
ఆ పాదమస్తకము కాపాడు వరము
వాలమ్ము అంతటా వ్యాపించలేదగ్ని
కొసమాత్రమే మండె కొరకంచులాగ
పరికించు వారికి పావక జ్వాల
శ్రీరామదూతకు శ్రీచందనమ్ము

రవిసోమ వీధులా రాజమార్గమ్ములా
రయముగా హనుమను తిప్పంగా
భద్రంపు మేడలూ బలుపైన లోగిళ్లు
చిత్రంపు చావిళ్లు చిరుమల్లె శాలలు
వానరుడు శ్రద్ధగా గమనించినాడు
పగవాళ్ల అనుపానులు గ్రహియించినాడు

కొనతోక తన చేత బట్టి
కుప్పించి తనమేను ఎగదట్టి
కొలువు కూటము చుట్టబెట్టి
గొప్పగృహముల చిచ్చుపెట్టి
రధతురగ శాలలు రాణువులు రావులు
రంగారు భవనాలు మండించెను
పావక జ్వాలలూ పండించెను
అల విభీషణు గుణము నెంచి
హరిభక్త గృహములు విడిచి
పటు ధూమ ధామమ్ము చేయగా
ఆ లంక భస్మీ పటలమైపోయెను
పరిసరమ్ములు భగ్గుభగ్గుమని మండినా
కుంభకర్ణుని నిద్ర భంగమ్ము కాలేదు

[హనుమ
సముద్రపుటొడ్డున వాలి
తోక చల్లార్చుకున్నాడు]

వారాశిలో ముంచి వాలమ్ము చల్లార్చి
అంతలోనే వ్యధ చెందెను
సీతమ్మ కేదైన కీడు వాటిల్లెనా!
చింతించె నా రామదూత
తొందర పాటును నిందించుకొనెను
దోష కృత్యాలను దూషించుకొనెను

॥వాచ్యా వాచ్యం ప్రకుపితో నవిజానాతి కర్హిచిత్
నాకార్య మస్తి క్రుద్ధస్య నాఽవాచ్యం విద్యతే క్వచిత్॥

పట్టరాని కోపమందు జీవులు
పలుకరాని మాటలే పలికెదరు
చేయకూడని పనులు చేసెదరు
ఉచితానుచితమ్ము లెరుగరు
ఉర్విలో ధర్మపథమున మెలగరు

వడివడి వనసీమ కేగె
తల్లి క్షేమము కళ్లజూసె

చేతులే జోడించినాడు
సెలవియ్యమని కోరినాడు
నాయనా స్వామి నిన్ను చూసిరమ్మన్నారా?
కాల్చిరమ్మన్నారా?
నీకు తెలియనిదేముంది తల్లీ
ఎవరు పెట్టిన చిచ్చు వారినే దహించేను
దేహాన్ని కొండంత పెంచాడు
కుప్పించి గగనాని కెగశాడు

[రాముని సన్నిధిన వాలాడు
సీతమ్మ వున్న దశకు శిరసా ప్రణమిల్లి]

హనుమ: కంటిని కన్నులార పొడగంటిని
సీతను శత్రుసీమలో
కంటిని బాష్పధార తన కంటికి మంటికి
జాలువార వా
ల్గంటిని కంటి క్రూర దశకంఠుని
పాపము పండ బోవుటన్
కంటిని కాంత నేత్రముల కంటిని
కంటిని మీదు రూపమున్!

[చూడామణి సమర్పించాడు]

చూడామణిని చూసి తోడనే రామయ్య
బొటబొటా కన్నీరు కార్చాడు
పూర్వగాథలు తలచుకున్నాడు
గుండెలకు అది హత్తుకున్నాడు
గుండెభారము దింపుకున్నాడు

[రాముడు లేచి హనుమను
గాఢంగా కౌగలించుకున్నాడు]

తనువార మనసార హనుమ
ఈగాఢ పరిష్వంగమే వినుమ
రాముని కానుకగా కొనుమ!
భగవంతునకే సాయము చేసిన
హనుమంతునకిదె మంగళం

సీతారాముల కలిపిన వారధి
సానూరికి శుభ మంగళం
అంధకారమున ఆశాదీపము
సుందరకాండకు మంగళం

**జయ మంగళం**
**శుభ మంగళం**

(ఉషాకిరణ్ మూవీస్ వారి సౌజన్యంతో)

★ ★ ★